

# ఆంధ్ర మహిళ

సంపుటి 20 జూలై 61 సంచిక 7

## విషయసూచిక



ఆంధ్ర మహిళ
7 ఎ. రోజరీచర్చిరోడ్, శాంథోమ్ - మద్రాసు

# "ఎర్రగులాబి వాడిపోయింది"

వసివాడని పువ్వులను
పసిపాపల నవ్వులను
ప్రేమించే మన ప్రియతమ
నెహ్రూ లేడిక!
ఇది కలకాదు నిజం
విధి బలీయమైనది
ఎర్రగులాబీ వాడిపోయింది!!

★ ★

నిరూపించి నాడు
మానవ సంకల్ప దీక్ష
అనుభవించినాడు
సుదీర్ఘ జైలు శిక్ష
పెట్టినాడు మాతృ భూమికి
స్వారాజ్య భిక్ష
గాంధీ జవహరు సందేశాలే
మనకు శ్రీరామ రక్ష
వారి జాడల నడుచుటయే
మన ఐక్యతకు పరీక్ష
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడిపోయింద!!

★ ★

కోట్ల కొలది దేశజనుల
హృదయాల్లో తేజంబై వెలిగిన
ప్రేమజ్యోతి ఆరిపోయింది
ప్రాగ్దేశాలకే ప్రతినిధిమైన
ధృవతార రాలిపోయింది!
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడిపోయింది!!

★ ★

పంచశీల సూత్రంపై
ప్రపంచాన్ని నిలిపి,
ప్రజా స్వామ్య పాలనలో
సామ్య వాద రేఖ దిద్ది,
అరిగి నాడు అమర పురికి
అసమాన ధీయుతుడు
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడి పోయింది!!

★ ★

విశ్వ శాంతి లక్ష్యానికి
శాంతి మార్గమే శరణ్యమని
రాజనీతి నిరూపించి
శాశ్వత విశ్రాంతికై
తరలి నాడు గావుల్ను
'శాంతి వనా' నికి
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడిపోయింది!!

★ ★

శాంతి దూత శంఖారవం
వినపడ దిక విశ్వానికి
భావి బాలలకు 'చాచా నెహ్రూ'
కనపడడిక ఎన్నటికీ
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడి పోయింది!!

★ ★

విశ్వ విఖ్యాత
శాంతి సంధాత
నవభారత నిర్మాత
శ్రీవీర జవహరునకు
ఇవేనా కన్నీటి జోహార్లు
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడిపోయింది!!

★ ★

పంచ భూతాలలో
లీనమైనాయి
అమృత పుత్రుని అశువులు
ఎప్పటికో! ఎన్నటికో
అట్టి మహనీయుని అవతరణ
"ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే"
విధి బలీయ మైనది
ఎర్రగులాబీ వాడిపోయింది!!

శ్రీమతి నిడుమోలు ప్రసూన




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 20 :: జూలై 1964 :: సంచిక 7

# మరొక మెట్టు

మద్రాసులోని ఆంధ్రమహిళా సభ నర్సింగ్‌హోమ్‌లోని ఈశ్వరీప్రసాద్ దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటర్‌కి, హాస్టల్ భవన ప్రారంభోత్సవము జూన్ నెల 13 వ. తారీకున జరుపుకొనడ మయింది. చిరకాలంగా ఆర్థోపెడిక్ సెంటర్‌కి బాల బాలికల వసతి గృహ ఆవశ్యకత, మా సభ కార్యకర్తలను, వ్యవస్థాపకు రాలిని బాధిస్తూ వున్నది. రెండేళ్ల క్రితం జరిగిన రజతోత్సవ సందర్భాన కేంద్రవిద్యాశాఖ యీ భవన నిర్మాణానికి లక్షరూపాయలూ శ్రీ హనుమంతరావు దంపతులు ముప్ఫైఅయిదు వేల రూపాయలూ విరాళంగా యిచ్చారు. ఈ ధనంతో శ్రీ హనుమంతరావుగారి తల్లి పేరిటన ఈ వెనిగళ్ల బాపమ్మా హాస్టల్‌కి కేంద్ర విద్యామంత్రి శ్రీ చాగ్లా ప్రారంభోత్సవం చేశారు. చిరకాలంగా ఈ హాస్టలు నిర్మాణానికై ప్రయత్నాలుసలుపుతున్న మావ్యవస్థాపకురాలి ఆశయాలూ, వికలాంగులబాగోగులే తమజీవితధ్యేయంగా పాటు బడుతున్న శ్రీ హనుమంతరావుదంపతుల కలలూ యీనాటికి కార్యరూపందాల్చినవి.

మద్రాసులో పాతికేళ్ళపాటు శ్రమించిన వెనుక- మా సభ వివిధ శాఖలు ఇంత విస్తృతమయాయి. హైద్రాబాద్‌లో వున్న విద్యానగరంలో మా సభని తిలకిస్తే మద్రాసులో పాతికేళ్ళపాటు పట్టిన మా నిరంతర శ్రమ - హైద్రాబాదులో అనతి కాలంలోనే కార్యరూపం దాల్చినదనిపిస్తుంది. ఇది ప్రజలకు మా సభపట్లగల సానుభూతి సహకారములకు మరొక నిదర్శనం. పోయిన మే నెలలో హైద్రాబాద్‌లో మా సభనూతన భవనముల గృహప్రవేశ మహోత్సవవేడుకలు రెండు రోజులపాటు జరిగినవి. అప్పటికి హైద్రాబాద్‌లోని మాసభ నర్సింగ్‌హోమ్ పునాదులు కట్టడదశలోనే వున్నవి. ఈ జూన్ ఇరవై ఏడున హైద్రాబాద్‌లోని మా నర్సింగ్‌హోమ్‌కి గృహప్రవేశ ప్రారంభోత్సవమూ, విద్యామందిర భవనానికి శంఖుస్థాపనోత్సవమూ జరిగినవి. హైద్రాబాద్‌లోని నర్సింగ్‌హోమ్ మద్రాసులోని మా నర్సింగ్‌హోమ్ వలెనే, రోగులకు, బీదసాదలకు చికిత్సాసౌకర్యాలు సమకూర్చి, ఆచ్చటిప్రజల ఆదరాభిమానాలను పొందగలదని ఆసిస్తున్నాము.

— మాలతీ చందూర్

గౌరవ సంపాదకులు

# సర్వసభ్య సమావేశము

**1964** జూన్ పదవతేదీ నాలుగున్నర గంటలకి లజ్‌చర్చిరోడ్‌లోని సభ ప్రాంగణంలో ఆంధ్ర మహిళా సభ సర్వసభ్య సమావేశము జరిగినది. ఈ సభకి ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపక అధ్యక్షు రాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ అధ్య క్షత వహించారు. ట్రస్టుబోర్డు సభ్యులూ, సం యుక్త కార్యదర్శినిలూ, జీవితసభ్యులు, సాధా రణ సభ్యులూ — చాలామంది యీ సభలో పాల్గొన్నారు.

జూన్ పదవతేదీ నాలుగుగంటలవేళ ముందు కార్యనిర్వాహకసభ్యులు శ్రీమతి దేశముఖ్ అధ్య క్షతన సమావేశమై సర్వసభ్యసమావేశములోని చర్చనీయాంశములను గూర్చి, సర్వసభ్య సమా వేశములో ప్రవేశపెట్టబోయే వివిధ శాఖల జమా ఖర్చుల రిపోర్టులను గూర్చి పరిశీలించి ఆమో దించారు. నాలుగున్నరకి సర్వసభ్య సమావేశము ప్రారంభ మయింది. తొలుత స్వర్గీయ పండిట్ నెహ్రూ, పిఠాపురం రాజాగారు, మీర్జాపురం రాణీగారు, కాశీనాధుని రామాయమ్మగారు మొదలగువారి స్మృతి చిహ్నంగా సభికులు రెండు నిమిషాలపాటు మౌనం వహించారు.

ఆదినుంచి ఆంధ్ర మహిళాసభను తన కన్న బిడ్డవలెనాకి, సభా ప్రారంభంనుంచి యీ నాటి వరకూ, అనారోగ్యంగా వున్నాసరే ఏదోవిధంగా సేవచేస్తున్న దుర్గాబాయిగారితల్లిగారు బెన్నూరి కృష్ణవేణమ్మగారి ఛాయా చిత్రాన్ని శ్రీమతి లక్ష్మీపార్వతిగారు ఆవిష్కరించారు. కృష్ణవే ణమ్మగారిపేరు చాలామందికి తెలియదు. అమ్మ మ్మగారంటే అందరికీ తెలుసు. సభకి నూతల విరాట్‌వంటి యీ మెను—సభలోని ప్రతివిద్యార్థిని సభికురాలు, పరిచితులు (అమ్మమ్మగారు) అని ప్రేమతో పిలుస్తారు. ఈమె ప్రతివారిని ఆప్యా యంగా, ప్రేమగా పల్కరించి కుశల ప్రశ్నలు వేస్తారు. సభకి అత్యంత ప్రేమ పాత్రురాలైన ఈమె ఛాయా చిత్రాన్ని విద్యామందిర్ హాలులో అలంకరించుట ఎంతయో సమంజస ముగానున్నది.

శ్రీమతి దేశముఖ్ సభాకార్యక్రమాన్ని ఆరం భిస్తూ ఆంధ్ర మహిళాసభ వివిధశాఖల గ్రాంటుల విషయమై తెలియబరిచారు. ఆంధ్రమహిళా సభ ట్రస్టుబోర్డూ, కొన్ని శాఖల 62-63, 63-64 సంవ త్సరములు ఆడిట్ కాబడిన జమాఖర్చుల రిపో ర్టులు సభికులకు పంచిపెట్టారు. ఈశాఖల జమా ఖర్చులు పరిశీలించి అమోదింపబడినవి. ఆయా శాఖల కార్యదర్శినులు, శాఖల కార్యక్రమాలను వివరంగా నివేదించారు. లోగడ రెండేళ్లుగా సభికుల తరఫున ప్రాతినిధ్యము వహిస్తున్న శ్రీమతి శివలెంక కామాక్షమ్మ గారిని తిరిగి 1964 డిశం బరు ఆఖరువరకూ ట్రస్టుబోర్డుకు ఎన్నుకొనడ మయినది. శ్రీమతి కస్తూరి రుక్మిణమ్మగారు, మాలతీచందూర్. యీ యిద్దరూ కార్యనిర్వా హక వర్గానికి సభ్యులుగా కొత్తగా ఎన్నుకొన బడినారు.

అనంతరం సభ వ్యవస్థాపక అధ్యక్షురాలు శ్రీమతి దేశముఖ్ హైదరాబాద్, మద్రాసులలో జరుగుతున్న భవన నిర్మాణ పథకాలను గూర్చి చర్చించారు. మద్రాసులో స్థలాభావం వల్ల నూతన భవన నిర్మాణ పధకాలు ఇక సాధ్యం కావనీ, హైదరాబాద్‌లో కూడా యీ సమస్యే ఆసన్న మవబోతున్నదనీ అన్నారు. విస్తృత మవుతున్న భవన నిర్మాణాలను చూసి చాల మంది ఆంధ్రమహిళాసభ చాలా సంపన్న సంస్థ అని దురభిప్రాయపడు తున్నారనీ, నిజానికి యీ సంస్థకి అర్థబలం కంటే అంగబలమే శ్రీరామ రక్ష అనీ అన్నారు. ఆంధ్రమహిళా సభ యీ నాడు యింత విస్తృత మవడానికి కారణం సభ సభ్యురాండ్ర నిరంతరవుత్సాహ కృషిలే ముఖ్య కారణమనీ అన్నారు. ఇక ముందు గూడా సభ లోని ప్రతిఒక్కరూ, తొలి రోజులలో వలెనే సభ వున్నతికి కృషి సలుపుతారని ఆశిస్తూ, కోరుతూ సభాకార్యక్రమాన్ని ముగించారు.

# కార్యనిర్వాహకవర్గ సమావేశము

1964 జూన్ పదిహేడవ తేదీ సాయంత్రం నాలుగు ముప్పావుకి ఆంధ్రమహిళాసభ ప్రాంగణంలో ఆంధ్ర మహిళాసభ కార్య నిర్వాహక సమావేశము వ్యవస్థాపక అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్ అధ్యక్షతను జరిగినది.

ఈ కార్యనిర్వాహక సభకి తిరిగి ఎన్నికయిన, సంయుక్త కార్యదర్శినులు శ్రీమతులు తిమ్మాబాయ్, లక్ష్మీపార్వతి, పర్వతవర్ధని, సుశీలాదేవిగారు గత సంవత్సరపు సభికులు శ్రీమతులు రంగనాయకమ్మ, లక్ష్మీకాంతమ్మ, సంపూర్ణమ్మ, కమలాబాయ్, అనసూయగార్లూ కొత్తగా ఎన్నికయిన శ్రీమతులు కస్తూరి రుక్మిణమ్మ, మాలతీచందూర్ గారలు, ప్రత్యేక ఆహ్వానమునందుకొని వచ్చిన ఆంధ్రమహిళాసభ నర్సింగ్ హోమ్ సూపరెండెంట్ పావనబాయ్, మల్లమదేవి హాస్టలు వార్డెన్ జి. వెంకుబాయమ్మగారుమున్నగు వారు విచ్చేశారు.

అధ్యక్షురాలు శ్రీమతి దేశముఖ్ తిరిగి ఎన్నికయిన పూర్వపు సభ్యులకూ 1964-65 సం॥కు కొత్తగా ఎన్నికయిన, కొత్త సభ్యులకూ స్వాగతం చెప్పారు, జూన్, పదవతేదీ జరిగిన - కార్యనిర్వక సభ విషయాలని ఆమోదించటమయినది.

అధ్యక్షురాలు సభికుల నుద్దేశిస్తూ ఆంధ్రమహిళా సభ వివిధ శాఖల కార్యకలాపాలనూ, ఆయా శాఖల నిర్వర్తించేవారి బాధ్యతలను వివరిస్తూ మాట్లాడారు. సభలోని వివిధ శాఖల కార్యకలాపాలు మహిళాసభ ప్రగతి ఏకైక లక్ష్యంగా పనిచేయాలి. విద్యాలయం, నర్సింగ్ హోమ్ మొదలగు శాఖలు - తమకి తాము విస్తృతిపొందుతున్నా మిగతా శాఖలతో ఏకీభావంతో పయినించడం లేదనిపిస్తుంది. ఏశాఖకాశాఖ తమ శాఖభివృద్ధికై శ్రమపడుతున్నయి. అట్లా తమయొక్క శాఖకేకాక ఆంధ్రమహిళాసభకొరకు సామూహికంగా పాటుబడుట అవసరమన్నారు. ఆయా శాఖల కార్యదర్శినులూ, నిర్వాహకులూ తమతమ శాఖల ప్రగతితో పాటు ఆంధ్రమహిళాసభ సమూహిక ప్రగతికికూడా పాటుబడాలన్నారు. సంయుక్త కార్యదర్శినిలూ, కార్యనిర్వాహక సభా సభ్యులు తరుచు కలుసుకుంటూ వుండి తమతమ కార్యకలాపాలను అభిప్రాయాలను చర్చించుకోటం ముఖ్యంఅన్నారు.

తమ తమ శాఖల నిర్వహణతో తమ కర్తవ్యము పూర్తిఅయినదని వూరుకోక మాతృసంస్థఅయిన ఆంధ్ర మహిళాసభ సాంఘిక సాంస్కృతిక సాహిత్య క్రీడా రంగాలలో కృషిచేస్తూ నూతన మార్గాల సభ ప్రత్యేకతని ప్రాముఖ్యతని నిలువవలెనని కోరారు. నెలకొకసారి సభ్యులు కలుసుకొని సభ అభివృద్ధికోరకై తగు విషయాలని చర్చించాలన్నారు.

ఆంధ్రమహిళాసభ కొరకని ప్రత్యేకం సంవత్సరానికి వెయ్యిరూపాయలు కేటాయించడమయిందనీ ఈ ధనంతో ప్రఖ్యాతుల వుపన్యాసాలుగాని కథాకాలక్షేపాలుగాని, రచయితల సింపోజియమ్స్‌గాని, చిన్న చిన్న ఫిలుమ్‌లుగాని, పాటకచ్చేరీలుగాని, ఆటలుగాని యిలా ఏదో ఒక సత్కాలక్షేపం కనీసం నెలకి రెండు సార్లయినా వుండేటట్లు చూడవల్సిన బాధ్యత సభ్యులపై వుందన్నారు. ముఖ్యంగా కార్యనిర్వాహక సభ్యురాలైన పి. సంపూర్ణమ్మగారు 'సభ' సాంస్కృతిక అభివృద్ధిభారం పైనవేసుకోవాలన్నారు.

శ్రీమతులు కస్తూరి రంగనాయకమ్మ, సుశీలాదేవి, జి. వెంకుబాయమ్మ, మాలతీచందూర్ యీ నలుగురూ-శ్రీమతి రంగనాయకమ్మగారు కార్యకర్తగా ఒక సంఘంగా ఏర్పడి ఆంధ్రమహిళాసభ జననకాలం నుంచి యీనాటివరకూగల, రాజపోషకులు, పోషకులు, జీవిత సభ్యులు, మామూలు సభ్యులు, శ్రేయోభిలాషులు, యిలా సభకి యీ యిరవై ఏడేళ్లుగా అనేకరీతుల ఆర్థికంగాను, కార్యపరంగాను సహాయపడిన వారి పేర్లను క్రమబద్ధంగా ఒక పట్టిక తయారుచేయాలని కోరారు. ఈ పట్టికని పరిశీలించి, సవరణలుచేసి, అచ్చునొత్తించి, ఆయా ప్రతులను సభలోని ప్రతి శాఖలోనూ వుంచట సభ్యుల కనీస ధర్మమన్నారు. ఈ పట్టికకు ఆరేసి మాసాల కొకసారి, నూతన సభ్యులను చేర్చి సరిదిద్దుతుండాలన్నారు.

'ఇరవైఏడేళ్లుగా ఆంధ్రమహిళాసభ అనేక రంగాలలో కృషి సలుపుతున్నది. ఆంధ్రమహిళాసభ స్త్రీలకి, పిల్లలకీ అనన్యసేవ చేస్తోంది అని తప్పితే-ఏరంగాల్లో ఎట్లా చేసింది, సభ చరిత్ర ఎటువంటిది-యీ విషయాలు ప్రజలకు బాగా తెలియదు. ఈ విషయాలు ప్రచారం కావాలంటే అసలు మనసభ చరిత్ర మనం విశదంగా సంగ్రహించి పొందుపరచాలి. యీ పని కూడా యీ కమిటీకే వొప్పజెబుతున్నాను-'అన్నారు. ఇరవైఏడేళ్లుగా సభకి సంబంధించి ఫోటోలు వేల సంఖ్యలో తీయబడ్డాయి. ఆయా సందర్భాల్లో తీసిన ఫొటోలు చేల్లా చెదరుగా అన్ని శాఖల్లోనూ పడివున్నాయి. ఇదేమాదిరి వివిధ పత్రికలలో ప్రచురితమైన రిపోర్టులుకూడా చెల్లాచెదురుగా వున్నాయి. ఇవేగాక సభ ప్రతి కార్యక్రమానికీ, వుత్సవానికీ సందర్భానుసారంగా ఆహ్వాన పత్రికలు అచ్చువేయబడ్డాయి. ఫోటోలు, న్యూస్‌పేపర్ కట్టింగ్స్, ఆహ్వాన పత్రికలు యీ మూడు క్రమబద్ధంగా ప్రోవు చేసి, మూడింటినీ విడివిడిగా మూడు ఆల్బమ్సులో పొందుపరచడం చాలా అవసరమన్నారు.

సభలోని వివిధశాఖలైన విద్యాలయం, నర్సింగ్ హోమ్, హాస్టల్సు, ప్రెస్, ఆంధ్రమహిళా, ఎలిమెంటరీ స్కూలు, ఆర్థోపెడిక్ సెంటర్ మొదలైన కార్య నిర్వహణ భారం ఆంధ్రమహిళాసభ ట్రస్టుబోర్డు చూచుకొంటున్నది గనుక ఆంధ్రమహిళాసభ సాంఘిక సంస్కృతిక విషయ నిర్వహణ వివిధ శాఖలలోని కార్యదర్శినిలూ, సభికురాండ్రూ బాధ్యతతీసుకోవాలన్నారు.

అధ్యక్షురాలి సలహాలను కార్యనిర్వాహక సభ్యులు ఆమోదించడమేగాక, తమ శక్త్యానుసారం, వారి సలహాలను కార్యాచరణకి తెస్తామని హామీ యిచ్చారు.

శ్రీమతి సుశీల మహిళా విద్యాలయ విషయంలోనూ, శ్రీమతి పర్వతవర్ధని, నాగేశ్వరశిశువిహార్. ఎలిమెంటరీ స్కూలు, వనితాబాలవిహార విషయంలోనూ, శ్రీమతి తిమ్మాబాయ్ నర్సింగ్‌హోమ్, ఫామిలీ ప్లానింగ్, నర్సుల హాస్టలు విషయంలోనూ శ్రీమతి లక్ష్మీపార్వతి ఆర్థోపెడిక్ సెంటర్, హాస్టలు విషయంలోనూ యీ నలుగురూ ఆయాశాఖల సంయుక్త కార్యదర్శినుల హోదాలో కార్యనిర్వాహకసభ సభ్యులుగా పనిచేస్తారు. శ్రీమతి అనసూయ టూరిస్టు హాస్టలుకూ, ప్రెస్, ఆంధ్ర మహిళ పత్రికల విషయంలో మాలతీచందూర్, సాహిత్యశాఖ విషయాలు శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు, సంగీతమూ, ఆర్కెస్ట్రా శాఖకి శ్రీమతి ఆర్. కమలాబాయ్‌గారు, మహిళాసభ సాంఘిక సంస్కృతి విషయాలు శ్రీమతి పి. సంపూర్ణమ్మ శ్రీమతి, కె. రుక్మిణమ్మగారలగా, మహిళాసభ చరిత్రా సభికుల జాబితాల తయారి విషయం శ్రీమతి కె. రంగనాయకమ్మగారికి వొప్పజెప్పబడింది.

కార్యనిర్వాహక సభ్యులు తమతమ శాఖలలో తాము చేయుచున్న కృషిగురించి, ముఖ్యంగా ఆనాడు తాము చర్చించిన విషయాల కార్యాచరణలో జరుగుతున్న ప్రయత్నాలగురించి అధ్యక్షురాలికి రెండు నెలల కొకసారైనా నివేదిక పంపవలసినదని కోరారు. సభ నిర్వకురాలు నెలకొకసారైనా-కార్యనిర్వాహక సభ్యుల సమావేశము జరిపించాలని కోరారు. నర్సింగ్ హోమ్ మెడికల్ సూపరెండెంట్ శ్రీమతి పావన బాయ్, మల్లమదేవి హాస్టల్ వార్డెన్ శ్రీమతి వెంకుబాయమ్మ వీరిద్దరినీ ప్రత్యేక ఆహ్వానంపై ప్రతి కార్యనిర్వాహకవర్గ సభకి పిలువవలెనని కోరారు.

రాబోవు కార్యనిర్వాహకవర్గ సమావేశము జూలై రెండవ వారంలో జరపు నిశ్చయించడమైనది. ఈ సమావేశములో అధ్యక్షురాలి సలహాలను కార్యాచరణలోకి గొనిరావడానికి ప్రయత్నాలని చర్చించి ఒక-కార్యక్రమం నిర్ణయించుకోడం జరుగుతుంది. అటుతరువాత యీ సంవత్సరం సభ శాఖలో జరుపవలసిన సంస్కృత, సాంఘిక, వివిధ కార్యక్రమాల విషయంగూడా జూలై మీటింగ్‌లో నిర్ణయింపబడుతుంది.

అగ్రాసనాధిపతికి-వందన సమర్పణతో ఆనాటి సభ ముగిసినది.

---

# విజయం

## మహిళా విద్యాలయం

మార్చి 1964 లో ఆంధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్షకు హాజరైన 22రు విద్యార్థినులలో, 13రు ఉత్తీర్ణులైరి.

ప్రథమశ్రేణి: (1) కో. శారద

ద్వితీయశ్రేణి; (2) సూ. నందిని (3)కొ. పర్వతవర్ధని (4) మా. రత్నకుమారి (5) సా. శ్యామల (6) రా. శంకరమ్మ (7) బెం. నాగరత్నమ్మ (8) అ. సావిత్రి (9) క. విజయలక్ష్మి

తృతీయశ్రేణి: (10) క. ఇందిర (11) గు, విష్ణుప్రియ (12) సి. విమల (13) క. సుబ్బలక్ష్మి.

# వెనిగళ్ల బాపమ్మ హాస్టల్

**1964** జూన్ 13వ తేదీ సాయింత్రం 5కిగం. అడయార్‌లోని ఆంధ్రమహిళాసభ నర్సింగ్‌హోమ్ ప్రాంగణంలోవున్న ఈశ్వరీప్రసాద్ దత్తాత్రేయ ఆర్థొపెడిక్ సెంటర్‌లోని వికాలంగులైన బాలబాలికల వసతి, విద్యావకాశాలకి శ్రీ వెనిగళ్ల హనుమంతరావుగారి తల్లి పేరట ఈ హాస్టలు నిర్మించబడి కేంద్ర విద్యామంత్రి శ్రీ చాగ్లాచే ప్రారంభోత్సవం చేయబడినది.

13వ తేదీ వుదయం ఏడు గంటలకు శ్రీ దేశముఖ్ దంపతుల పర్యవేక్షణక్రింద శ్రీ హనుమంతరావు దంపతులు వాస్తుపూజ గృహప్రవేశమూ మున్నగు శాస్త్రీయమైన తదంగమంతా పూర్తిగావించి, అచ్చట సమావేశమైన వారికి ఫలహార పాయసములు పంచిపెట్టారు. ఆదే లగ్నాన నర్సుల రిక్రియేషన్ సెంటర్‌కికూడా గృహప్రవేశం జరిగింది.

ఆనాడు మధ్యాహ్నంవేళ విద్యామంత్రి సాయింత్రం జరుగబోవు ప్రారంభోత్సవానికని ఢిల్లీనుంచి విచ్చేశారు. శ్రీ చాగ్లాకి విమానాశ్రయంవద్ద మహిళాసభ తరఫున మా సభ వ్యవస్థాపక ఆధ్యక్షురాలు శ్రీమతి దేశముఖ్ స్వాగతం చెప్పారు.

ఆనాటి సాయిత్రం నాలుగున్నర గంటలవేళ శ్రీ చాగ్లా దేశముఖ్ దంపతులు వెంటరా, మా సభ మాతృసంస్థ అయిన లజ్ చర్చిరోడ్‌లోని ఆంధ్రమహిళాసభ భవనాలు తిలకించి, అచటినుండి నాగేశ్వరశిశువిహార్ ఎలిమెంటరీ స్కూలు రాజ్యలక్ష్మి యిండస్ట్రియల్ యిన్‌స్టిట్యూట్ శాంథోమ్‌లోని ఆంధ్రమహిళా ప్రెస్, ఆంధ్రమహిళ పత్రిక కార్యాలయం వీక్షించి, అక్కడినుంచి ఆంధ్రమహిళా సభ నర్సింగ్‌హోమ్, టూరిస్ట్ హాస్టల్, ఆర్థొపెడిక్ సెంటర్, నూతన గృహమయిన హాస్టలు చూసి, సభా వేదికవద్దకు నాగస్వర వాద్యాలమధ్యనుంచి వచ్చారు. శ్రీ మంత్రిగారిని సన్నాయి మేళంతో నర్సింగ్‌హోమ్ ఆవరణలోకి సభ కార్యదర్శినులు ఆహ్వానించారు. నర్సింగ్‌హోమ్‌లోని వివిధశాఖల శిక్షణా విద్యార్థినులు వందనసమర్పణ కావించగా, వారిమధ్యనుంచి వెళ్ళుతూ వివిధ శాఖలని—అతి శ్రద్ధగా పరికించారు శ్రీ చాగ్లా.

ఆనాటి సభ పలువురి పుర ప్రముఖులతో కిటకిటలాడింది. నర్సస్ రిక్రియేషన్ సెంటర్‌కని ప్రత్యేకంగా నిర్మింపబడి ఆ వుదయమే వేదోక్తంగా తెరువబడినసభా వేదికపైన విద్యామంత్రి శ్రీ చాగ్లా శ్రీ లక్ష్మణస్వామి మొదలియార్, శ్రీ దేశముఖ్ దంపతులూ, శ్రీ హనుమంతరావుగారు ఆశీనులైనారు. మద్రాసు ముఖ్యమంత్రి శ్రీభక్తవత్సలం ఆనాటిసభకి అగ్రాసనాధిపత్యము వహించవలసినది. కాని వారు కార్యభారమువలన ప్రారంభ సమయానికి రాలేకపోయినందువలన, వారి స్థానము మద్రాసు విశ్వవిద్యాలయ వుపాధ్యక్షులు శ్రీ లక్ష్మణ స్వామి మొదలియార్ అధ్యక్షత వహించారు.

ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపక అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్‌దేశముఖ్ కేంద్ర విద్యామంత్రికి స్వాగతం చెబుతూ, ఆంధ్రమహిళాసభ యిరవైఆరేళ్ళుగా చేస్తున్న సేవని, సభాచరిత్రని క్లుప్తంగా పరిచయంచేశారు. శ్రీ హనుమంతరావు దంపతుల—అనారోగ్య పీడితుడైన ఏకైక పుత్రుడు ఈశ్వరీ ప్రసాద్‌దత్తాత్రేయుడు జన్మించినప్పటినుంచి రుగ్మతతో బాధపడి మరణించగా, ఆదంపతులు దుఃఖసాగరంలో మునిగివున్నప్పుడు-తాము ఈశ్వరీప్రసాద్‌వంటి వేలాది బాలబాలికలు- ఏ చికిత్సా లేక, ఏ సహాయమూ లేక ఎటుల మరణిస్తున్నదీ తెలిపి, అటువంటి వికలాంగుల సేవలో, తమ దుఃఖాన్ని బాధనీ మరవడమేగాక, వేలాది వికలాంగుల ముఖాల్లో తమ కొడుకు ముఖాన్ని చూడవచ్చుననీ బోధించగా, ఈ దంపతులు తమ కుమారునిపేర లక్ష రూపాయల విరాళంతో ఈశ్వరీప్రసాద్ దత్తాత్రేయ ఆర్థొపెడిక్ సెంటర్ నెలకొల్పారని తెలిపారు. వికలాంగులైన యీ బాలబాలికలకు, వైద్యమూ, తగిన వ్యాయామమూ, విద్యయేగాక, వారికి అనువైన వృత్తి విద్యలుకూడా యిచట గరుపుతున్నారు. కాని వికలాంగులైనవారి అవసరాలు అక్కడితో ఆగడంలేదు. ఈ నిలయంలోని బాల

బాలికలకు తగు వసతి గృహంలేదు, ఇన్నాళ్ళుగా వీరి భోజనాదికాలు నర్సింగ్‌హోమ్ హాస్టల్‌నుండి ఏర్పాటు చేయబడుతున్నాయి.

ఇచటి బాలబాలికలకు హాస్టలు నిర్మాణానికి ఆంధ్రమహిళాసభ సిల్వర్ జూబ్లీసమయంలో శంకుస్థాపనజరిగింది. కేంద్రవిద్యాశాఖ లక్షరూపాయలు విరాళమూ, హనుమంతరావు దంపతులు ముప్పైఅయిదువేల రూపాయల విరాళమూ యిచ్చారు. ఈ ధనంతో యీ హాస్టల్ నిర్మాణం జరిగినది. ఇందులో డెభై మంది పిల్లలకు వసతి సౌకర్యములు గలవు. గాస్‌స్టవ్‌లతో కూడిన విశాలమైన వంటగది, భోజనాలశాల, విడివిడిగదులూ, యిలా వికలాంగులైన యీ బాల బాలికలు, ఆర్థోపెడిక్ సెంటర్ నుంచి హాస్టల్ భవనంలోకి వచ్చేలాగా తేలికయిన కారిడర్స్, చక్రాలబండీలు తిరుగునట్లు ఏటవాలుగా నిర్మింపబడినవి. ఈ విషయాలు వ్యవస్థాపకురాలు తమ వుపన్యాసంలో మంత్రిగారికి సభికులకి తెలిపారు.

శ్రీ చాగ్లా ఆంధ్రమహిళా సభ చేస్తున్న సేవని కొనియాడుతూ, వికలాంగుల సెంటర్స్, హాస్టల్స్ అతి తక్కువ సంఖ్యలో వున్న మన దేశంలో, యిటువంటి వాటి అవసరం ఎంతేనా వుందన్నారు. ముఖ్యంగా వికలాంగులు, బలహీనులు, స్త్రీలు, శిశువులూ వీరిపట్ల మన సంఘం ప్రత్యేక శ్రద్ధని చూపాలన్నారు. ప్రతి ప్రజాహిత కార్యమూ ప్రభుత్వమే పూనుకొని చెయ్యాలని సాధారణంగా అంటూంటారు. కాని ఇది ప్రభుత్వానికి సాధ్యం కాదు. బొంబాయి, ఢిల్లీవంటి నగరాలలో కూడా సంపన్న ప్రజలు ప్రజాహిత కార్యాలకు విరాళాలు అనగానే పన్నుల బాధపెరిగిందంటూ వెనక్కితగ్గు తారనీ, మద్రాసు నగర వాసులు అట్లాగాక వుదార హృదయంతో యీ మాదిరి ప్రజాహిత కార్యాలకు తగువిరాళమిచ్చి ప్రోత్సహించడం హర్షించదగిన విషయమనీ. ముఖ్యంగా ఆంధ్రమహిళా సభ వంటి స్వచ్ఛంద సేవా సంస్థలు యిలా ముందుకొచ్చి గణనీయమై సేవచేయుట ప్రస్తుతించ దగిన విషయమనీ, మద్రాసు ప్రజల వుదారతా, ఆంధ్రమహిళ సభ వంటి స్వచ్ఛంద సంస్థల సేవా నిరితీ యిదేమాది చిరకాలమూ వర్ధిల్లగలవని తానుకోరు కుంటూన్నాననీ శ్రీ చాగ్లా అన్నారు.

శ్రీ లక్ష్మణస్వామి మొదలియార్ ఆంధ్రమహిళా సభ చేస్తున్నా సేవని కొనియాడుతూ, స్వర్గీయ నెహ్రూకి ప్రేమపాత్రులైన పసికందుల విషయంలో యీ సెంటర్ వారు చేస్తున్న సేవ సమంజ సంగా వుందని అన్నారు. ప్రతి బాలుడు, వికాలంగుడైనా అనారోగ్య వంతుడైనా తనొక వ్యక్తినని గుర్తింపబడే టట్లు మన పరిసరాలు వుండాలన్నారు. అందులోనూ వికలాంగులకు వుత్త వైద్యమే గాక, విద్య, వృత్తి విద్యగరిపి వారిని స్వశక్తి వంతులుగా చేయాలని కోరారు.

సభ జరుగుతుండే విచ్చేసిన మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం గారు ఆంధ్రమహిళా సభ పటిష్ట వంతమైన ఒక సేవ సంస్థయనియూ ఈ సంస్థ అనేక మార్గాల ప్రజోపయోగ కార్యాలు నెరవేర్చిన దనియూ, యీనాడు నూతన మార్గాన మరో ప్రజాహిత కార్యం నెరవేరుస్తున్నదనీ కొనియాడారు వికాలంగులైన యీ బాల బాలికల భవష్యత్ జీవితం సుగమం చేసే బాధ్యత ప్రజలపై వుందని అన్నారు.

ఆనాటి సభలోనే శ్రీమతి శివలెంక కామాక్షమ్మగారు ఈ వికలాంగుల సెంటర్‌కి ఏడాదికి అయిదు వందలు చొప్పున విరాళ మిస్తామని ప్రకటించారు. శ్రీ హనుమంతరావు దంపతులు మరొక లక్షరూపాయలు మూలధనం విరాళంగా యిస్తున్నట్లు ప్రకటించారు. ఈ ట్రస్టు ధనం సెంటర్‌లోని పిల్లల ప్రగతికి వుపయోగిస్తారు. డాక్టరు సి. డి. దేశముఖ్ వందన సమర్పణతో ఆనాటి సభ ముగిసినది

ఆరాత్రి ఎనిమిదిన్నరకి వెనగళ్ళ బాపమ్మ హాస్టల్ నూతన భవనంలో విద్యామంత్రి గౌరవార్థం విందు జరిగినది. విందుకు అనేకులు విచ్చేశారు విందు అయాక ఆర్థొపెడిక్ సెంటర్‌లోని చిన్నారి బాలలు ఒక గంట సేపు నాటికలూ, పాటలతో సభికులని ఆనందం పరిచారు.



పెద్దకథ:

# ప్రతిజ్ఞ

(గతసంచిక తరువాయి)

(రసపుత్ర కన్య భానుమతి తనసఖి రాధికతో వేటకు వెళ్ళి, సెలయేటిని దాటుతున్న లేడిపిల్లమీద బాణం సంధిస్తుంది. నేలకూలిన లేడి శరీరంపై రెండు శరాలు వుంటం చూసి ఆశ్చర్య చకితు రాలవుతుంది. అచటికి వచ్చిన విజయసింగ్ లేడితన శరం వల్ల కూలినదని వాదిస్తాడు. ఈ యువతీ యువకులు లేడి ఎవరి శరం వల్ల కూలినదని తర్జన భర్జన పడుతుంటే చిత్తోడ్ రాణా మంత్రియగు కుంభవైరసి అచటికొచ్చి. తన కుమార్తె భానుమతి శస్త్ర నైపుణిని కి గర్వపడుతూ. దళపతి విజయసింగ్‌ని కుమార్తెకి పరిచయం చేస్తాడు యువతీ యువకులు తమ మధ్య జరుగుతున్న తర్జనని మరచిపోయి, యిరువురు ఒకరి నొకరు క్రీగంట తిలకిస్తారు.)

భానుమతి నుదుటిపై లాస్యంచేసే ముంగురులను సవరిస్తు విజయ్ "భాను, నీ చేతులార నా నుదుట వీరతిలకం దిద్ది వీరగంధం పూసి వీరఖడ్గ మందించి వీడ్కోలిచ్చే శుభ సందర్భానికే యెదురుచూస్తున్నాను సుమా!'' అన్నాడు.

భానుమతి కిలకిల నవ్వుతూ, "అంతేనా! ఏదో యిప్పుడే, యిక్కడే వీరపత్ని కైంకర్యాన్ని నెరవేర్చమని ఆజ్ఞాపిస్తారేమోనని భయపడినాను'' అన్నది.

విజయసింగ్ ఆశ్చర్యంతో. "రసపుత్ర స్త్రీకి భయమా? నీ కర్తవ్యం పట్ల నీ కెందుకీ విముఖత?'' అన్నాడు.

"విముఖత కాదు విజయ్! భానుమతి రసపుత్ర కన్య మాత్రమేనన్న విషయం మీరు విస్మరించారా!'' అన్నది లజ్జతో.

"భాను! మానసికంగా నీవు నా ధర్మపత్నివి సుమా!''

"మన హృదయాలు స్వీకరించినా పెద్దలు అనుమతించేవరకు వేచివుండక తప్పదు.''

"భాను, పెద్దలు మన కోర్కెను హర్షామోదాలతో స్వీకరిస్తారు. బూందీ విజయానంతరం మన వివాహం. మరొక పర్యాయం నీ చేతులార వీరోచిత సత్కారాలనందుకొనిదే యుద్ధానికి వెళ్ళను. నీ చేతిలో చేయివేసి బాస చేస్తున్నాను.'' విజయసింగ్ భానుమతి చేతిలో చేయివేసి ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు.

భానుమతి తన్మయత్వంతో అతని చేతులను కండ్లకద్దుకొని "అది నా భాగ్యం! విజయ్! మీరు విజయులై తరలిరండి'' అన్నది.

భానుమతి ముఖమును పైకెత్తి ఆమె కళ్ళల్లోకి చూస్తూ "నేను వెళ్ళనా?'' అన్నాడు విజయ్.

భానుమతి తన చూపులలోనే అతనికి అనుమతిచ్చినది. విజయసింగ్ తన చూపులనుండి మరుగు పడేవరకు భానుమతి చూస్తు నిలచిపోయింది.

★

మహారాణాగారి అధ్యక్షతతో అసంఖ్యాకమైన చిత్తోడ్ సైన్యం దుమ్మురేపు కొంటూ బూందీవైపు ప్రయాణం సాగించింది. ఈ దాడి

రహస్యంగానే జరిగింది. కానీ మార్గమధ్య రాణా సైన్యం దండువిడిసినప్పుడు విషయం ఎలాగో మహారాజుకు తెలిసి పోయింది. విషయం తెలిసిన తక్షణమే హామూరాజు ఐదువందల వీర యోధులతో వెళ్ళి అర్ధరాత్రిలోనే రాణా సైన్యంపై విరుచుకు పడినాడు. ఇరుసైన్యాలకు మధ్య భీభత్సమైన సంగ్రామం జరిగింది. నిద్ర మత్తులో వుండిన రాణా సైన్యం హామూ హఠాత్ ఆక్రమణకు తట్టుకోలేక పోయింది. ఎదురుచూడని సంఘటనతో రాణాగారి సైన్యం చాలావరకు నష్టమైనది. శేషించిన సైన్యంతో పరాజితుడైన రాణా చిత్తోడ్ చేరుకొన్నాడు. తన సామంతునికి పాఠం నేర్పబోయి తానే అవమానితుడైనందుకు రాణా హృదయం క్రోధంతో నిండి పోయింది.

కలవని కలంపుగా ఓడిపోయిన పరాభవంతో చిత్తోడ్ రాణా క్రుంగిపోయేడు. అల్ప సంఖ్యాకులైన హాడా రసపుత్రులముందు తన అసంఖ్యాకమైన సైన్యం పతనమందినందుకు ఒకవైపు ఆగ్రహం మరోవైపు అవమానంతో రాణా హృదయం తీవ్రమైన ప్రతీకారవాంఛ భయంకర రూపం దాల్చినది. ఆక్రోషంతో "బూందీకోటను ధ్వసం చేసేవరకు అన్నపానాదులు స్వీకరించనని" ఘోరప్రతిజ్ఞ చేశారు రాణా. మంత్రి సేనాపతులు రాణా చేసిన ప్రతిజ్ఞను పరిశీలించినప్పుడు గాని భయంకర పరిణామం వారికి విశదమైనది. ముప్ఫయిరెండు కోసుల దూరంలోవున్న బూందీ కోటను వశంచేసు కొనుటకు కాలవ్యవధి అవసరం. దూరభారమైన స్థలం. పైపెచ్చు కష్టపడిన దానికంటే అధికమైన సైన్యమును సిద్ధపరచాలి అంతవరకు మహారాణా అన్నపానాదులు త్యజించిన రాణాగారి ప్రాణం నిలుచుటెట్లు? ప్రాణత్యాగానికైనా సిద్ధపడగలరు గానీ రసపుత్రవంశీయులైన మహారాణా తమ శపథాన్ని ఎంత మాత్రం మార్చుకోలేరని బాగా గ్రహించారు. సర్దార్ రణధీర్ సింగ్ తదితరులు కలసి సమావేశమై యోచించి ప్రతిజ్ఞ పరిహారంగా ఒకవుపాయం ఆలోచించారు. కానీ ఆ వుపాయాన్ని స్వీకరించుటకు రాణా సమ్మతించలేదు. బూందీలోని దుర్గంలాగే చిత్తోడ్‌లో కల్పిత దుర్గాన్ని నిర్మించి దాన్ని రాణా దళబలంతో వెళ్ళి స్వాధీనం చేసుకోవడం, దీనితో రాణాగారి ప్రతిజ్ఞ తాత్కాలికంగా నెరవేరినట్లు, రాణా అన్నపానాదులు గ్రహించి, అనువైన యుద్ధ సన్నాహాలతో వెళ్ళి నిజమైన బూందీ కోటను ఆక్రమించుకొని రాణా శపథాన్ని పూర్తి చేయడం; చాలా ప్రయాసమీద రాణాగారిని సమ్మతింపజేశారు.

చిత్తోడ్ రాణాగారి ప్రధాన మంత్రి కుంభవైరసి హాడావంశ రసపుత్రుడు. సుమారు రెండు వందలకు పైగానే హాడారసపుత్ర వీరులు రాణాగారి కొలువులో వున్నారు. రాణా ప్రతిజ్ఞచేసిన సమయంలో కుంభవైరసి చిత్తోడ్‌లో లేడు. అందువల్ల మహారాణాగారు చేసిన ప్రతిజ్ఞ విషయము, ప్రతిజ్ఞాపాలనార్థం నిర్దేశించిన కల్పిత దుర్గనిర్మాణం మున్నగు విషయాలు తెలియదు. కుంభవైరసి వేటనుండి నగరాభిముఖుడైనప్పుడు దారిలో దుర్గనిర్మాణాన్ని చూచి చకితుడైనాడు. క్రొత్తకోట నిర్మాణంలో తగు సలహాలిస్తూవున్న రణధీర్‌తో, నూత్న దుర్గ నిర్మాణానికి కారణం విచారించాడు కుంభవైరసి.

రణధీర్ కుంభవైరసితో, "ఇది బూందీ కల్పిత దుర్గం. కోట నిర్మాణం దాని వైశాల్యం, కోట ప్రధాన ద్వారం, బురుజుల గంభీరత యివన్నీ బూందీ కోటను మరపిస్తున్న దికదూ!" అన్నాడు.

కుంభవైరసికి అతని సమాధానం అవగానం కాలేదు, "బూందీ కోటను చిత్తోడ్‌లో నిర్మించుటలో రాణాగారి ఉద్దేశం?" అని ప్రశ్నించాడు.

"అమాత్యులు హాడావంశ రసపుత్రులు!" గూడార్థంలో ధ్వనించినవి.

"హాడావంశ రసపుత్రుడనైనా నేను సేవిస్తున్నది చిత్తోడ్ రసపుత్రులను. చెప్పు రణధీర్. హాడావంశానికి కల్పిత దుర్గానికి సంబంధమేమి? త్వరగా చెప్పు!"

రణధీర్ సావధానంగా, "సమీపంలో బూందీ కోటపై జరిపిన మన ఆక్రమణను హాడా వీరులు ధ్వంసంచేసిన విషయం తమకు విదితమే! హామా రాజుతో అవమానితులై వద్దరిల్లిన రాణాగారి హృదయంలో ఉద్భవించిన వీరావేశమే ఘోర శపథంగా పరిణమిల్లింది. బూందీ కోటను ఆక్రమించేవరకు అన్నపానాదులు స్వీకరించనని మహారాణా ప్రతిజ్ఞచేశారు. వారి ప్రతిజ్ఞను నెరవేర్చుటకే కృత్రిమ దుర్గ నిర్మాణం. మహారాణా కృత్రిమ దుర్గంపై దాడిచేసి కోటను స్వాధీనం చేసుకొన్నతర్వాత తమ శపథాన్ని వుపసంహరించుకొంటారు. ఆ తర్వాత బూందీ దుర్గంపై నిజమైన ముట్టడిచేసి విజయం సాధించనున్నాము!" అని విశదీకరించాడు.

కుంభవైరసి రక్తం వుడికింది. ఆవేశంతో "రణధీర్! రాణాగారి ప్రతిజ్ఞా పాలనార్థం హాడా రసపుత్రులను అవమానించుటయా?" అన్నాడు.

"తాము చిత్తోడ్ రాణాగారి కొలువులో ప్రముఖ పదవివహిస్తూ హాడావంశ రసపుత్రుల పక్షం వహించుట భావ్యం కాదేమో?"

"రణధీర్! చిత్తోడ్‌గడ్డపై నివసిస్తు రాణాగారి వుప్పు తింటూ మహారాణాగారికి ద్రోహమాపాదించను. కానీ, నా శరీరంలో ప్రవహించేది హాడా వంశ వీర రక్తం! నా మాతృభూమికి తీరని కళంక మాపాదిస్తున్నప్పుడు చూస్తూ సహించను. మహారాణా బూందీ కోటపై దండెత్తుట భావ్యం కానీ, కృత్రిమ దుర్గం నిర్మించి బూందీ రసత్రులను అవమానింప జూచుట రాణాగారికే గౌరవహాని. ఇది కేవలం బూందీలోవున్న హాడా రసపుత్రులనే గాక చిత్తోడ్‌లోవున్న హాడా వీరులను సహితం అవమానించినట్లే!" అన్నాడు.

"అయితే మీ ఆశయం?...చిత్తోడ్‌లోవున్న అల్ప సంఖ్యాకులైన హాడా రసపుత్రులను రెచ్చగొట్టబోతున్నారా?"

"నేను రెచ్చగొట్టడమేమిటి రణధీర్! తన జాతికి, తన మాతృగడ్డకు యింతటి అవమానం జరుగుతున్నప్పుడు హాడా రసపుత్రుడు చూచి సహించగలడా?"

"మహామంత్రీ! మీ పంతం మీ పతనానికి దారితీయగలదు."

"పతనంకాదు రణధీర్! బూందీ రసపుత్రుల స్వాభిమానాన్ని వారి గౌరవాన్ని అభ్యోన్నతికి తీసుకరాగల గొప్ప విప్లవం! హాడావంశజుల గౌరవాన్ని మట్టిలో గలిపినట్లు కృతిమ దుర్గాన్ని నిర్మాణించి మరుక్షణమే దాన్ని ధ్వంసంచేసి ప్రతిజ్ఞాపాలనం చేయడమన్న విషయం కేవలం చిన్న పిల్లల బొమ్మలాటకాదు. హాడా రసపుత్రుల మానాభిమానాలు కల్పిత దుర్గంలో యిమిడి వున్నవన్న సత్యాన్ని మహారాణాగారికి విశద పరుస్తాను."

కుంభవైరసి పురాభిముఖుడైనాడు.

★

అర్ధరాత్రి దాటింది. చంద్రుడు కురిపిస్తున్న వెన్నెలతో ఆ ప్రదేశమంతా ప్రజర్విల్లసాగింది. చంద్రునికి సహకరించేటట్లు నక్షత్రాలు మినుక్ మినుక్ మని మెరుస్తున్నాయి. కాళీ కోనెలవెనుక నున్న మర్రిచెట్టుక్రింద జవ్వానులిద్దరు నిలచి యెవరి రాకకో ఎదురుచూస్తున్నారు. వారి నిరీక్షణను వుపేక్షిస్తున్నట్లు రెండవ ఝాముకూడా మెల్లగా జారిపోతున్నది. క్షణాలు ఘడియలుగా మారే కొలది వారి హృదయాలు భయంతో కంపింప సాగినవి.

కలవరంతో భానుమతి, "రాధికా! మూడవ ఝాముకూడా సమీపించబోతున్నది. యింకా దళపతిజాడ లేదు. కాళీమాత కోనెలకు రమ్మని నొక్కి చెప్పినావుకదూ!" అన్నది.

"అంత కలవరమెందుకు భాను? దళపతి తప్పకుండా వచ్చేటట్లు బాసచేసివున్నాడు."

"ఏమో రాధికా, నా మనస్సెందుకో అధైర్య పడుతున్నది. నా ఆశ నిరాశై పోతుందేమోనని బెంగపడుతున్నాను."

"మాకందరికీ ధైర్యంచెప్పే నీవే యిలా అధైర్యపడితే యెలాగ? అదిగో అటుచూడు... దూరంలో ఎవరు?...ఆ గంభీరమైన నడక ఎవరిది?" అంటూ అటువైపు వేలుతో చూపించింది రాధిక.

ఆతురతతో భానుమతి, "అవును రాధికా! దళపతి విజయసింగే వస్తున్నారు" అన్నది.

"భాను, యిప్పటికిగాని నీ సందేహం తీరలేదు. నేను ఆలయంలోకి వెళ్ళి అన్నీ సిద్ధంచేయనా!"

"ఊఁ... వెళ్ళు. ప్రియసఖి నీ మేలెన్నటికీ మరువను."

రాధిక కాళీకోవెలలోకి వెళ్ళిపోయింది.

విజయసింగ్ భానుమతిని సమీపించాడు. ఇద్దరూ ఒకరినొకరు చూస్తూ కొన్ని క్షణాలు నిలచిపోయారు.

విజయసింగ్ భానుమతి చుబుకాన్ని పైకెత్తి "భాను, ఆలస్యంగా వచ్చినందుకు కోపమా!" అని బుజ్జగించుతూ అడిగినాడు.

"లేదు విజయ్! మీరు రారేమోనని భయపడి పోయాను."

"నా భానుమతి ప్రత్యేకాహ్వానాన్ని ఉదాసీనం చేయగలనా!"

"నామీద మీకంత అనురాగం ముందా విజయ్!"

విజయసింగ్ భానుమతి కరాన్ని ప్రేమతో స్పృశించుతూ, "భాను, రసపుత్ర వీరుడు ముందు తన కరవాలాన్ని పిదప తన అర్ధాంగిని త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తాడని నీకు తెలియదా!" అన్నాడు.

భానుమతి అతని కళ్ళల్లోకి తన అనురాగాన్ని చిందుతూ, "అర్ధాంగి! విజయ్, ఆ మాట నన్నెంత మురిపిస్తున్నదో తెలుసా? నాకా భాగ్యాన్ని ఎప్పుడు ప్రసాదిస్తారు?" అని ప్రశ్నించింది లజ్జతో ప్రజ్వల్లిన నయనాల్లోని భావాలను చవిచూస్తూ, విజయ్, "నీవు కోరినప్పుడు ఏం భాను! నా కర్తవ్యాన్ని నేను మరచిపోగలనా!" అన్నాడు.

"ఎంతమాట, విజయ్! ఆ శుభ ఘడియల కొరకు మీ ప్రియురాలెంత ఆతురతతో ఎదురు చూస్తున్నదో తెలుసా!"

తన హృదయంలో పొంగి పొరలే ప్రేమోద్రేకాన్ని భానుమతి కళ్ళల్లోకి ప్రయోగిస్తూ "ఆ శుభ ఘడియలు త్వరలోనే సమీపించవచ్చు. భాను, నేటి నీ అలంకరణలో నాకేదో క్రొత్తదనం స్ఫురిస్తున్నదనుకో!" అన్నాడు విజయ్. ఆమె అందాన్ని నఖశిఖపర్యంతం చూస్తూ.

భానుమతి లజ్జాభారంతో తలవంచుకొని తన ప్రియుని కొనగంటితో చూస్తూ, "ఏమిటా క్రొత్తదనం!" ఆమె అధరంపై మనోహరమైన హాస్యం లాస్యమాడింది.

భానుమతి తలను పైకెత్తి సిగ్గుతో రెపరెప లాడుతున్న నయనాల్లో సూటిగాచూస్తూ "చెప్పనా!" అన్నాడు విజయసింగ్.

"ఊఁ" భానుమతి అతని పట్టును సడలించుకొని తొలిగింది.

*********************************

## శ్రీమతి రూపాబాయి మోతీలాల్

*********************************

"అటు ఓరగా తొలిగిపోతే ఎలా చెప్పను భాను? రా దగ్గరగా రా ఊఁ ఎందుకింత సిగ్గు నా వైపు యిటు నా కళ్ళల్లోకి చూడు.

భానుమతి నయన తారలు సిగ తెరలను చీల్చుకొని ఒక్కసారి విజయ చూపుల్లో లీనమై పోయినవి.

భానుమతి ముఖాన్ని ప్రేమతో తన రెండు చేతుల్లోకి తీసుకొని ఆమె అందాన్ని తన నేత్రాలతో ఆఘ్రాణిస్తు, "ప్రియా! నీ అపూర్వ అందానికి మెరుగులు దిద్దిన అలంకారాలను ఎలా వర్ణించగలను? నళినమైన నీ పాదాలనలంకరించిన పారాణి, తామర తూడుల్లాంటి కరాల్లో ధరించిన ముత్యాల కంకణాలు, వాటిమధ్య మెరిసే పచ్చటి గాజులు, సుకుమారమైన వ్రేళ్ళకు అంటిన గోరింటి ఎరుపుదనం, నీ బంగారుచ్ఛాయ మేని నలంకరించిన పసుపువర్ణ పీతాంబరం, వదన భూషణమై ఒప్పారే తిలకం, నీలోత్పలాలను హేళణచేస్తున్న అంజనం, సిగ్గు తెరలనుండి తొంగిచూచే నయన తారల్లో వెల్లువిరిసే భావాలు"

భానుమతి హేళన స్వరంతో "ఊఁ అయిందా మీ వర్ణన?" అన్నది.

"ఆగు ఆగు చిన్న కొరత"

"చిన్న కొరత? ఆకారంలోనా లేక అలంకరణలోనా?"

"అలంకరణ లోనే!"

"ఏమిటది?"

"చెప్పనా? నీ సుదీర్ఘమైన పాపిటలో.

"ఊఁ పాపిటలో" భానుమతి కంఠంలో ఆతురత ధ్వనించింది.

"సింధూరం ధరిస్తే నూత్న వధు అలంకరణ"

భానుమతి ఓరజూపుతో, "విజయ్! వధువు పాపిటలో ప్రప్రథమంగా సింధూరం నింపేదెవరు?" అన్నది.

"వరుడు భాను నేను నేనే త్వరలో నీ పాపిట నిండుగా నాచేతులార సింధూరం నింపుతాను. సరేనా?"

భానుమతి దీర్ఘనిశ్వాసంతో, "నాకా భాగ్యం వున్నదా విజయ్!" అన్నది.

"ఎందుకులేదు? నామీద నీకు నమ్మకంలేదా?"

"ఆ భాగ్యాన్ని యిప్పుడే ప్రసాదించ కూడదా?"

విజయసింగ్ ఆశ్చర్యంతో "ఇప్పుడా?" అన్నాడు.

"అవును ప్రభూ! నాకా భిక్షను యిప్పుడే, యిక్కడే ప్రసాదించండి. అందుకే మిమ్మల్నింత అవసరంగా పిలిపించాను విజయ్! నా కోర్కెను నిరాకరించవద్దని మీ పాదాలపై బడి అర్థిస్తున్నాను."

తన పాదాలపై ఒరిగిపోతున్న భానుమతిని తన హృదయానికి చేర్చుకొని, "భాను, నిన్ను ఏనాడో నా హృదయేశ్వరిగా స్వీకరించాను" అన్నాడు విజయసింగ్.

"విజయ్! నా ఆశయాన్ని నెరవేర్చగలరన్న నిండు ఆశతో వచ్చాను."

"భాను, బూందీ దండయాత్ర అనుకోని విధంగా పతనమైనది. మహారాణాగారి ప్రతిజ్ఞా పాలనార్థం కృత్రిమ దుర్గం సృష్టించబడినది. కృత్రిమ దుర్గ ధ్వంసానంతరం బూందీ దేశంపై నిజమైన దాడి చేయనున్నాము. ఈ పర్యాయం విజయం తప్పదు. విజయానంతరం మన వివాహం తప్పదు."

భానుమతి మౌనంతో ముఖం వాల్చినది.

"భాను, ఎందుకీ మౌనం?" అంటూ భానుమతి ముఖాన్ని పైకెత్తిన విజయసింగ్ చకితుడై "భాను. ఏమిటి కన్నీటిధార? నీ మనస్సును నొప్పించానా?" అన్నాడు.

"లేదు విజయ్! నిశ్చలమైన నా ప్రేమను తృణీకరిస్తున్నారు."

విజయ్, విస్మయంలో, "నీ ప్రేమను తృణీకరిస్తున్నానా? భాను నీవు నిజంగా నన్ను నమ్మలేదా?" అన్నాడు.

"నమ్మినందుకే హతాశతో నా హృదయం వ్రయ్యలై పోతున్నది విజయ్!"

భానుమతి చెక్కిళ్ళపై ప్రవహిస్తున్న అశ్రుకణాలను తుడుస్తు, "హతాశ! భాను నీ మాటలు నా కర్థంకావడం లేదు. హతాశకు కారణం?"

"కారణం ప్రస్తుతం వివరించలేను. నిశ్చలమైన మీ అనురాగానికి అర్హురాలనైతే చిత్తోడ్ పరమేశ్వరి సమక్షంలో నన్ను మీ అర్ధాంగినిగా స్వీకరించండి. అదే మీ ప్రియురాలి తిరస్కరింపరాని కోర్కె" అంటూ భానుమతి అతని వక్షంపై వాలిపోయింది.

భానుమతి శిరమును ప్రేమతో నిమురుతూ, "నా ప్రియురాలి కోర్కె తీర్చుటకంటే పెన్నిధి లేదు ప్రియా! భాను, లోకమాత సమక్షంలో నిన్ను నా సపత్నిగా పరిగ్రహిస్తాను."

భానుమతి పెదవులపై నళినమైన నగవు పుష్పించింది. విజయసింగ్ భానుమతితో ఆలయం వైపు వెళ్ళాడు.

కాళీమాత సమక్షంలో సర్వం సిద్ధంచేయబడినది. కోవెల పూజారి అధ్వర్యాన కాళీదేవి సన్నిధిలో భానుమతి విజయసింగ్‌ల పాణిగ్రహణం జరిగింది. రాధిక అందించిన సింధూరపు భరిణె నందుకొన్న విజయసింగ్, "భానుమతీ! చిత్తోడ్ పరమేశ్వరి సమక్షంలో అగ్నిసాక్షిగా నిన్ను నా సహధర్మిణిగా స్వీకరించాను. భాను, మంగళ చిహ్నమైన సింధూరాన్ని నీ పాపిటలో నింపి నీ నుదుట దిద్దుతున్నాను. ఈ క్షణంనుండి ఒకరి నొకరు ఎడబాయని దంపతులం" అని అంటూ భానుమతి సౌభాగ్యాన్ని సిందూరంతో తీర్చి దిద్దినాడు.

ఆలయంలోని గంట బలంగా మ్రోగింది.

"హృదయేశ్వరీ! నీ సోయగం పూర్ణత్వమందినది!"

అమితానంద భరితమానసంతో భానుమతి, "నా జన్మ తరించింది. నా సౌభాగ్యానికి మురిసిపోతున్నాను. ప్రభూ! ఈ శుభ సమయంలో నేనేదైనా కోరవచ్చునా?" అన్నది.

"పాణిగ్రహణానంతరం నీవు కోరే మొదటి కోర్కెను నెరవేర్చుటే నా ముఖ్య కర్తవ్యం!"

ఈ దినం నా పుట్టింట నేను సర్వ స్వతంత్రురాలనై మెలగుటకు అనుమతించమని కోరుతున్నాను."

"ఇదేనా నీ కోర్కె? సాయంత్రం పల్లకీతో వచ్చేవరకు నీవు మీ పుట్టింట వుండవలసినదానవే!"

"ప్రభూ! కృత్రిమ దుర్గ ముట్టడిలో మీరు పాల్గొనుట నిశ్చయమేనా?"

"అవశ్యం పాల్గొనక తప్పదు."

"బూందీ దుర్గంపై దాడివెళ్ళినప్పుడు మీరన్నది జ్ఞాపకం వుందా?"

"ఎందుకు లేదు? నీ చేతులార వీర సత్కారాల నందుకొనే నిజమైన బూందీ ముట్టడికి ప్రారంభిస్తాను."

'ప్రభూ! కాళీమాత సమక్షంలో మీకు వీరోచిత సత్కారాలతో వీడ్కోలిస్తాను.

"భానుమతీ! రేపు చేయబోతున్నది కేవలం కృత్రిమ యుద్ధం!"

కృత్రిమయుద్ధమైనా యుద్ధ ముస్తాబులతో వెళ్ళనున్నప్పుడు వీరోచిత సత్కారాలతో వెళ్ళుట యుక్తమని నా అభిప్రాయం!"

"ప్రేయసీ! మహారాణా ప్రతిజ్ఞాపాలనార్థమే యీ ప్రయత్నం నిజమైన యుద్ధంకాదు."

"అది మహారాణా ఆశయి వుండునేమో కానీ, పెండ్లిపీటలమీదే మిమ్మల్ని రణరంగానికి పంపుటకు నే నెంతో గర్విస్తున్నాను."

"సరే, నీ యిష్టానుసారం చేయి. నాకు గర్వ కారణ మె!"

భానుమతి సంతోషంతో కాళికాదేవి పాదాబ్జములపై వున్న కుంకుమను విజయసింగ్ మస్తకంపై దిద్దుతూ, "కాళీమాతా! నీ సమక్షంలో లగ్నవేదికనుండే, కంకణవిసర్జనకు పూర్వమే నాపతిని యుద్ధసన్నద్ధుల జేస్తున్నాను. నీ పాదధూళినే నా పతికి వీరతిలకంగా దిద్దుతున్నాను. నీ మేని గంధమే నాభర్తకు వీర కవచం! స్వామీ! ఇదిగో పగతురను చీల్చి చెండాడి మీ స్వాభిమానాన్ని రక్షించే వీరఖడ్గం! పరమేశ్వరి అనుగ్రహంతో జయభేరిని మ్రోయించి తరలిరండి!" అన్నది.

భానుమతి అందిచ్చిన ఖడ్గమందుకొన్న విజయసింగ్, "దేవీ! ఘడియలను క్షణాలుగా గడిపి నీకొరకు వస్తాను" అని అంటూ ఆమె కరాన్ని గట్టిగా పట్టుకొన్నాడు.

"స్వామీ! మీ భానుమతి మీ కొరకు యుగయుగాలు వేచివుండగలదు!"

విడలేక, వీడిపోలేక, విడువలేక ప్రేమోపాసకుల కరబంధనం వీడిపోయింది. ప్రేమాంకితమైన నేత్రాలు అర్ధనిమీలితములై మెల్లగా మూతవడినవి.

విజయ్, రాధికతో, "రాధికా! నీ సఖిని భద్రంగా తీసుకొని వెళ్లు!" అని ఆదేశించాడు.

భానుమతి రాధిక ననుసరించింది. విజయసింగ్ భానుమతి ఛాయచీకటిలో లీనమయ్యేవరకు చూస్తూ నిలిచాడు.



చిత్తోడ్ రాణా చిన్న సైన్యంతో కృత్రిమదుర్గ ముట్టడికి పయనమైనారు. రాణా గుండ్లులేని ఫిరంగులనే ప్రేల్చమని తమ వీరులకు ఆజ్ఞాపించారు. అలాగే వీరులు కృత్రిమదుర్గంపై ఫిరంగులను కృత్రిమంగా ప్రేల్చారు. కానీ, ఆశ్చర్యం! కల్పిత దుర్గంనుండి నిజమైన ఫిరంగులు ప్రేలినవి. పిడుగుల్లాగ గర్జించే ఫిరంగుల శబ్దాన్ని విన్న వీరులు విస్మయచకితులైనారు. నిర్మానుష్యమైన కోటనుండి, 'హాడా రసపుత్రులకు జై! బూందీ కోటకు జై!' అన్న జయ ధ్వానాలు చెలరేగినవి. ఒకవేళ శత్రుసైన్యం కృత్రిమదుర్గంలో దాగివున్నదేమోనని శంకించారు. రణధీర్ సింగ్ కోటదగ్గరికి వెళ్ళి పరిశీలించాడు. చిత్తోడ్‌లోని హాడా రసపుత్రులు కోటలో యుద్ధసన్నద్ధులై వున్నట్లు గ్రహించాడు. రాణావద్దకు వెళ్ళి కోటలో హాడా వీరులు శస్త్రసమేతులై వున్నట్లు విశదీకరించాడు.

కోపోద్రిక్తుడైన రాణా, "రణధీర్! నిజమైన ముట్టడిని ప్రారంభించండి ఫిరంగులను ప్రేల్చి దుర్గమును నేలమట్టంచేసి కోటలోవున్న హాడా రసపుత్రులను చీల్చి చెండాడి చిత్తోడ్‌లోని హాడా రసపుత్ర వంశాన్నే నిర్మూలంచేయండి!" అని గర్జించాడు.

తక్షణం సైన్యం కోటచుట్టు ముట్టడిని ప్రారంభించినది. రాణా రణధీర్‌తో కోట ద్వారాన్ని సమీపించి "కోటలో దాగిన భీరులెవరు? ధైర్యమున్న మా ఎదుట నిలచి యుద్ధం చేయండి!" అని ఆదేశించారు.

కుంభవైరసి వినయవిధేయతలతో మహారాణాగారికి ప్రణామము లర్పించి నిలచాడు.

కుంభవైరసిని చూచినదే రాణా స్తంభించిపోయి "ఎవరు? ప్రధాని కుంభవైరసీ? మహామంత్రీ యింతటి ద్రోహానికి కారణభూతులు మీరేనా?" అని ప్రశ్నించాడు.

కుంభవైరసి సావధానంతో "క్షంతవ్యుడను మహారాజా! ఇది ద్రోహంకాదు. ప్రస్తుతం కుంభ

వైరసి హాడా రసపుత్రుడు మాత్రమే! మాతృదేశ గౌరవార్థం యుద్ధకంకణం ధరించివున్నాము. అల్ప సంఖ్యాకులైన హాడా వీరులను గమనించండి ప్రభూ! ఆ బాలగోపాలం మాతృమూర్తి గౌరవాన్ని కాపాడేనిమిత్తం శస్త్రం చేబూని వున్నా" అన్నాడు.

రాణా బలంగా నవ్వి, "కుంభవైరసీ? ఎందుకీ మమత? దీని ఫలితాన్ని యోచించిచూచారా? హాడాజాతి వినాశానికి దారితీస్తున్నారు" అని హెచ్చరించారు.

"ప్రతిఒక్క హాడా రసపుత్రుడు దీని ఫలితాన్ని వూహించియేవున్నాడు. మహారాణా, ఇది మా వినాశానికి కాదు, హాడాజాతి స్వాభిమానాన్ని రక్షించుకొనుటకు, మా జన్మభూమి ఋణాన్ని తీర్చుకొనుటకు; మా ఆత్మార్పణతో బూందీ సుస్థిరమైన స్వాతంత్ర్యాన్ని సాధించగలరు."

"కుంభవైరసీ! ఇది ఆత్మార్పణకాదు. ఆత్మహత్యకు సులభమైన దారి. మీరు మరణానికి తెగించినట్లున్నారు."

"మహారాణా! వీరుడు ఒక్కపర్యాయమే మరణిస్తాడు. వీరయోధునిగా రసపుత్రుడు యుద్ధగళాన్ని చూస్తూ జన్మిస్తాడు. అక్కడే వీరస్వర్గమలంకరిస్తాడు. బ్రతికితే స్వాభిమానం లేదా వీర స్వర్గం! యిదే రసపుత్రుని సూత్రం!"

"మంత్రీ, ఇది కేవలం మా ప్రతిజ్ఞాపాలనార్థం కల్పించబడిన కృతిమయుద్ధగళం."

"కాదు మహారాణా! మీ ప్రతిజ్ఞాపాలనార్థమని బూందీ దుర్గమును, హాడా రసపుత్రులను అవమానించే నిమిత్తం నిర్మాణించబడిన యుద్ధగళము. మేము చిత్తోడ్ రాణా సేవకులమైనా మా మాతృదేశ గౌరవాన్ని, బూందీ కోటకు ప్రతిబలమైన యీ కల్పిత దుర్గాన్ని అవమానించుటచూచి సహించలేము. మా ప్రాణాలను ఒడ్డియైనా కన్నతల్లి మర్యాదను కాపాడగలము. ప్రభూ! కేవలం చిన్నపిల్లల బొమ్మలాటలాగ నిర్మానుష్యమైన కోటను ముట్టడించి స్వాధీనం చేసుకొనుటలో మీకేమి గౌరవం? మీరు విజేయులైనట్లు, మీ ప్రతిజ్ఞపూర్తియైనట్లు నిర్ణయించుటెట్లు? మమ్ము గెల్చి మీ శపథాన్ని పూర్తిచేసుకొనుటే ఉచితం!"

"కుంభవైరసీ! యిదేనా మీ కృతనిశ్చయం!"

"క్షమించండి ప్రభూ! మాతృమూర్తి మర్యాదను రక్షించుటే మా లక్ష్యం! మహారాణా! చిత్తోడ్ ప్రధానామాత్యుడన్న పదవితో కర్తవ్యభారంతో కార్యనిర్వహణ దీక్షతో శిరోభారంగా మోసిన నా తలపాగను క్రిందపరచి హృదయపూర్వకంగా మీకు స్వాగతమిస్తున్నాను. దీని మీద నడచివచ్చి మమ్ము జయించి మీ ప్రతిజ్ఞను పాలించండి!" అని అంటూ భక్తిపూర్వకంగా తన తలపాగాను తీసి నేలపై పరచినాడు కుంభవైరసి.

మహారాణా కోపావేశంలో తన వీరుల వైపు తిరిగి, "సర్దార్ రణధీర్‌సింగ్! దళపతి విజయ్‌సింగ్! ముట్టడిని ప్రారంభించండి. చిత్తోడ్‌సైన్యం ముందు హాడాసైన్యం తృణప్రాయం! విజయం సాధించండి!" అన్నాడు.

చిత్తోడ్ సైనికులు విజయధ్వానాలు చేస్తు రణరంగంలో కురికారు. 'బూందీకోటకు జై హాడాజాతికి జై!' అన్న జయధ్వానాలతో హాడారసపుత్రులు కదనంలోకి దిగినారు. హాడావీరులు మాతృదేశ గౌరవార్థం తమ ప్రాణాలను లక్ష్యం చేయక రణగళంలో కురికి తమ నేర్పును చూపినారు. యుద్ధం ఘోరరూపం దాల్చింది. రాణా సైన్యం అసంఖ్యాకమైనదైనా, స్వాతంత్ర్యదాహంలోను, మాతృదేశపు స్వాభిమానాన్ని కాపాడే లక్ష్యంతోను ముందంజవేసిన హాడారసపుత్రులు చాలా వరకు రాణా వీరులకన్నా అధిక సామర్థ్యంతో తమకౌశలాన్ని చూపినారు. కానీ, వేలకు వేలున్న చిత్తోడ్ సైన్యం ముందు

రెండు వందల హాడావీరులు ఎంతసేపు నిలువ గలరు? తమలక్ష్యం కొరకు పోరాడుతూ వీరస్వర్గ మలంకరించారు. ప్రధాని కుంభ వైరసి కూడ వీరస్వర్గ మలంకరించాడు. కుంభ వైరసికి ప్రక్కనే వుండి రణరంగంలో మెరుపుతీగలా తిరుగుతూ శతృవులను చీల్చి చెండాడిన వీరుడు కుంభవైరసి హతుడైనది చూచి ఆక్రోశంతో కొదమసింగం లాగ రణధీర్‌పై కురికినాడు. అతని బల్లెం రణధీర్ గుండెను దూసుకపోయింది. రణధీర్ నేలకొరిగినాడు. ఇది గమనించిన విజయసింగ్ వీరావేశంతో రణధీర్‌ను చంపిన హాడా వీరునితో కలియబడినాడు. కానీ హాడావీరుడు తన ఖడ్గాన్ని నేలమీద పారవేసి నిలచిపోయాడు. అతని భీరత్వాన్ని గమనించిన దళపతి తన ఖడ్గాన్ని ఝుళిపిస్తు, "భీరుడా! నిరాయుధుని చంపనన్న ధైర్యంతో ఖడ్గాన్ని విసర్జించావా? తీసుకో నీ ఖడ్గాన్ని!" అదలించాడు.

హాడా వీరుడు నిబ్బరంగా నిలచి "విసర్జించిన ఖడ్గాన్ని మళ్ళీ పరిగ్రహించను" అని అంటూ, తన చేతిని అతని ముందుకు చాచినాడు

అతని చేతిని గమనించిన దళపతి ఆశ్చర్యంలో "నీ చేతిలోనూ కల్యాణ కంకణమా? నాలాగే నీవుకూడా వివాహమైన మరుక్షణమె నీ సతివద్ద వీడ్కోలందుకొని వచ్చినావా?" అని అన్నాడు.

"కాదు, కాదు నేనే నా పతిని వీరోచిత సత్కారాలలో యుద్ధభూమికి పంపినాను."

"నీవు నీవు స్త్రీవా? నీ ప్రియభర్తకు వీడ్కోలిచ్చిన వీరవనితవా?"

ఆ వీరుడు తూలుతూ తన తలపాగాను తీసి, "ప్రభూ! నన్ను మీరింకా గుర్తించ లేదా! నేను నేను మీ."

ఆమె తలలో పాపిటనిండుగా సింధూరం చూచేనదే విజయసింగ్ కళ్ళు చెమ్మగిల్లినవి. "భానుమతీ! నా భానుమతీ, నీవేనా? నీ పాపిటలో నింపిన సింధూరం చెక్కు చెదరక ముందే యిదేమి స్థితి? గాయాలయి నీదేహమంతా రక్తసిక్తమై పోయినదే!" అంటూ పడిపోతున్న భానుమతిని తన భుజాలపై చాచుకొన్నాడు.

"విజయ్! చివరి క్షణాల్లోమిమ్ము చూడ గల్గినందుకు సంతోషిస్తున్నాను."

తన హృదయంపై వాలిన భానుమతి తల నిమురుతు, "ప్రియా! మన రహస్య వివాహానికి కారణం యిదేనా! ఈ అల్ప సంతోషానికేనా నీ పాపిటలో సింధూరం నింపమని నిర్బంధించావు! నీ కోర్కెలోని గూఢార్థాన్ని గ్రహించ అశక్తుడనైనాను ముందే యీ విషయాన్ని దాచకుండా వుంటే యీ అనర్థం సంభవించి వుండ దేమో!" అని వాపోయాడు.

"స్వామీ! నేను హాడా రసపుత్రని స్త్రీని కృత్రిమ దుర్గంలో యుద్ధ సన్నద్ధులైన హాడావీరుల రహస్యాన్ని నేనెట్లు చెప్పగలను? మీరుచిత్తోడ్ రసపుత్రులు మీరు మహారాణా గారికి ద్రోహ మాపాదించలేరు!"

ఆవేదనలో భానుమతి చెక్కిళ్ళపై జారెలశ్రు బిందువులను తుడుస్తు, "భాను, నీ పుట్టింటికి, మెట్టింటికి చిరయశస్సు నార్జించావు. నిన్ను అర్ధాంగినిగా బడసినందుకు నేనెంతో గర్విస్తున్నాను సుమా!" అన్నాడు విజయ.

"స్వామీ! మీ పాద సన్నిధిలో నా ఆత్మ అంతరించ బోతున్న నా సౌభాగ్యానికి నేనెంతో గర్విస్తున్నాను." అన్న మాటలే భానుమతి చివరి మాటలు. ఆ వీరాంగన ఆత్మ భర్త ఒడిలో అమరత్వమందినది.

"ప్రియా! భాను...భాను" అంటూ ఆమె ముఖమును తన ముఖానికి చేర్చుకొని హృదయ క్షోభతో విలపించాడు విజయసింగ్.

విజయం సాధించిన చిత్తోడ్ వీరుల జయ ధ్వానాలు మిన్ను ముట్టినవి.

హాడా వీరుని మృత శరీరంపై అశ్రు ధారకురిపిస్తున్న విజయుని జూచి రాణా చకితుడై "విజయ్ సింగ్! మన వీరులు జయధ్వానాలు చేస్తు పురాభిముఖులగుచుండ నీ విక్కడ ఏం చేస్తున్నావు? ఎవరీ వీరుడు? ఇతని మృత శరీరంపై కన్నీటిధార కురిపిస్తున్నావెందుకు?" అని ప్రశ్నించాడు.

"ప్రభూ! యితను యితను" తడబడుతూ అన్నాడు విజయసింగ్.

"గుర్తించాను విజయ! కుంభవైరసికి అంగరక్షకుడై మెరుపుతీగలా మెరిసి మన సైన్యాన్ని చిన్నాభిన్నం చేసిన హాడా వీరుడు!"

"వీరుడు కాదు ప్రభూ? వీరవనిత!"

రాణా విస్మయంతో, "వీరవనిత? విజయ! ఎవరీ వీరవనిత?" అన్నాడు.

"నా అర్ధాంగి? కుంభవైరసి సుపుత్రి!"

"నీ అర్ధాంగి? విజయ నీవు?"

"వివాహితుడను మహారాజా! గతరాత్రి కాళీమాత సమక్షంలో యీమెను నా సహధర్మిణిగా పరిగ్రహించాను. లగ్న వేదిక మీదే వీరతిలకం దిద్ది, హిత సత్కార్యాలతో నన్ను ప్రుద్రేక పరచి యుద్ధభూమికి సాగనంపిన ధీర రత్నం. పాపిటలోని సింధూర తిలకపు శోభ అధరంపై పుష్పించిన చిరునవ్వు ముఖంలోని నూత్న వధువు కళ పూరక ముందే నా ప్రేయసి ఆత్మ స్వర్గ దామన్నలంకరించినది. కాదు కాదు నా ప్రేయసి వీరస్వర్గ మలంకరించినది." అని అంటూ ఉన్మత్తునిలా దుఃఖించాడు విజయసింగ్.

రాణా లజ్జతో శిరం వంచుకొన్నాడు. "విజయ! నా ప్రతిజ్ఞ పరిహారం ఎంతటి పాతకానికి దారి తీసినది? కుంభవైరసీ! వీరనారి భానుమతి నిగన్న నీవు ధన్యుడవు. భానుమతీ! నీ మాతృ దేశ భక్తి, లగ్న వేదిక నుండి భర్తను రణభూమికి పంపిన నీ వీరత్యాగం రసపుత్రనారీలోకానికి తలమానికం!! నీ వీరపత్ని కర్తవ్యం- యుద్ధ కౌశల్యం, మనో స్థైర్యం రసపుత్ర చరిత్రలో చిరస్థానం వహించగలదు. కుంభవైరసీ! నా ప్రతిజ్ఞ పరిహారాన్ని ఆశ్రయించినది. నీ ఆత్మాభిమానం హాడాజాతి గౌరవాన్ని, స్వాభిమానన్ని, మాతృగడ్డ మర్యాదను రక్షించినది!! నీ ఆత్మ త్యాగంతో సిగపడిన బూందీ స్వాతంత్ర్యాన్ని ఎన్నటికీ ఆక్రమించను. చిత్తోడ్ పరమేశ్వరి మీద ఆన! నేటి నుండి బూందీ స్వతంత్ర రాజ్యం కలకాలం బూందీ స్వేచ్ఛగా వర్ధిల్లుగాక." అంటూ, వీరస్వర్గమలంకరించిన ధన్యజీవులకు అంజలి ఘటించాడు.

జన్మభూమి కొరకు, తన జాతికొరకు, స్వాభిమానం కొరకు ప్రాణత్యాగం చేసిన కుంభవైరసి గౌరవార్థం రాణా బూందీ దుర్గంపై దాడిచేయలేదు. రాణా బూందీని స్వతంత్రరాజ్యంగా ప్రకటించాడు. రాణా వంశీయులకు కప్పం కట్టని బూందీ రాజ్యం స్వతంత్రంగానే విలసిల్లినది!



# నాగేశ్వర శిశువిహార్ హయ్యర్ ఎలిమెంటరీ స్కూలు

## 1962–1963 సంవత్సరపు నివేదిక

5 సంవత్సరముల క్రిందట పిల్లలకొరకు స్థాపించిన ఈ చిన్న పాఠశాల ఈనాడు అభివృద్ధిలోనికి వచ్చి 8వ తరగతి కూడ ఆరంభించుటతో హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలగా మారుట చాలా గమనించదగిన విషయము.

## 1962–1963 సం॥ లో చదివినపిల్లలు

| | | |
|---|---|---|
| మొదటి తరగతి – | 52 (బాలురు) | 61 (బాలికలు) |
| రెండవ తరగతి – | 34 ( ॥ ) | 26 ( ॥ ) |
| మూడవ తరగతి – | 22 ( ॥ ) | 26 ( ॥ ) |
| నాల్గవ తరగతి – | 9 ( ॥ ) | 16 ( ॥ ) |
| ఐదవ తరగతి – | 10 ( ॥ ) | 8 ( ॥ ) |
| ఆరవ తరగతి – | 4 ( ॥ ) | 25 ( ॥ ) |
| | 131 (బాలురు) | 162 (బాలికలు) |
| మొత్తము. | | 293 |

## 1963–1964 సంవత్సరములో

| | | |
|---|---|---|
| మొదటి తరగతి – | 52 (బాలురు) | 61 (బాలికలు) |
| రెండవ తరగతి – | 34 ( ॥ ) | 26 ( ॥ ) |
| మూడవ తరగతి – | 22 ( ॥ ) | 26 ( ॥ ) |
| నాలవ తరగతి – | 9 ( ॥ ) | 16 ( ॥ ) |
| ఐదవ తరగతి – | 10 ( ॥ ) | 8 ( ॥ ) |
| ఆరవ తరగతి – | 4 ( ॥ ) | 25 ( ॥ ) |

శ్రీ యుతులు సాంగ్లి రాజాసాహెబ్. రాణీసాహెబ్ గారలు ఈ పాఠశాలకు విచ్చేసినారు. శ్రీరాజబహదూర్, శ్రీ హనుమంతరావుగారు, శ్రీ ఐసాక్ ఆల్బర్ట్ (డి. ఇ. ఒ) గారలు వచ్చి పాఠశాలను చూచినారు. మేము 1963 జూన్ మాసములో శ్రీ కక్కన్ అధ్యక్షతను వనమహోత్సవము చేసుకున్నాము. క్రిందటి సంవత్సరము శ్రీ దేశ్ ముఖ్‌గారు స్వాతంత్ర్యదినము నాడు పతాకావిష్కరణ గావించిరి ఏప్రిల్ 17వ తేదీన ఆటల పోటీలు జరిగినవి. ఏప్రిల్ 20వ తేదిన శ్రీ ఐసాక్ ఆల్బర్ట్ (డి. ఇ. ఓ) "పేరెంట్స్ డే" కి అధ్యక్షత వహించి బహుమతులు పంచిపెట్టినారు.

## గవర్నమెంటువారు ఇచ్చిన గ్రాంటులు

| | | 1962–1963 | 1963–1964 |
|---|---|---|---|
| వనితా బాలవిహార్ – | రూ | 1,020–00 | 4000–00 |
| నాగేశ్వర శిశు విహార్ ఎలిమెంటరీ పాఠశాల | రూ | 5,636–93 | 8,788·08 |
| నాగేశ్వర శిశువిహార్ | | | 800·00 |

## నాగేశ్వర శిశువిహార్ ఇంగ్లీషు మీడియం సెక్షన్
## 1962–1963 సంవత్సరపు నివేదిక

1962–1963 సంవత్సరములో ఇంగ్లీషు మీడియం సెక్షనులో 12 మంది పిల్లలు వుండినారు.

- నర్సరీక్లాసు – 5
- మొదటి తరగతి - 4
- రెండవ తరగతి - 1
- మూడవ తరగతి - 2

వీరిలో 11 మంది 1963 ఏప్రిల్ మాసములో పైతరగతికి పంపబడినారు.

1963–1964 సంవత్సరములో ఇగ్లీషు మీడియంలో చదివినవారు 21 మంది పిల్లలు.

- నర్సరీ తరగతి - 10
- మొదటి తరగతి - 9
- రెండవ తరగతి - 2

వీరిలో 16 మంది పిల్లలు పైతరగతికి పంపబడినారు,

## నాగేశ్వర శిశు విహార్
## మాంటెసరీ సెక్షన్

1962–1963 సంవత్సరములో 47 మంది వుండినారు. వారిలో 37 మంది పిల్లలు 1963 ఏప్రిల్ మాసములో మొదటి తరగతి పంపబడినారు.

1963–1964 సంవత్సరములో ఈ సెక్షనులో 27 మంది పిల్లలు వుండినారు వారిలో 15 మంది 1964 ఏప్రిల్ మాసములో మొదటి తరగతికి పంపబడినారు.

శ్రీమతి ఎ. పర్వతవర్ధని

# తల నొప్పిగా ఉందా?

రవ్వంత **అమృతాంజనము** రాయండి

నిమిషంలో
నొప్పి తగ్గుతుంది



జలుబూ, జ్వరాలూ, ఒళ్లు నొప్పులు – వీటన్నిటికి అమృతాంజనం ఉపయోగించండి. మీ కుటుంబాని కది శ్రీరామరక్ష. నొప్పి కలిగినప్పుడు ఒక్కపిసరు రాస్తేచాలు ఇంట్లో ఒక్క సీసా ఉంటే నెలలతరబడి ఆటివస్తుంది.




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - 4
బొంబాయి - 1, కలకత్తా - 1, న్యూఢిల్లీ - 1.

JWT AM-1424

# నర్సింగ్ హోమ్



4522 మంది రోగులకి చికిత్సా, 1786 స్త్రీలకి కాన్పులూ ...94 విద్యార్థినులకు మిడ్‌వైఫ్ నర్స్ శిక్షణ, 47 మందికి ఫేమిలీవెల్ఫేర్ (ప్లేనింగ్) శిక్షణ...ఇది మా నర్సింగ్‌హోమ్ 1963–64 సంవత్సరములో నిర్వహించిన కార్యక్రమం.

ఆంధ్రమహిళా సభ నర్సింగ్‌హోమ్ ప్రసూతిగృహముతో కలిపి డబ్భై అయిదు మంచాలు కలిగి వున్నది. 1962–63. సంవత్సరములో 4,389 రోగులు చికిత్స పొందారు 1731 మంది స్త్రీలకు కాన్పులు జరిగినవి. 1963–64 సంవత్సములో 4,522 మంది రోగులకి చికిత్సా. 1,786 స్త్రీలకి కాన్పు కేసులు చేయబడినవి.

ప్రయివేటు వార్డులలోను జనరల్ వార్డులోని రోగులు అందరికిని వుచితమైన దుస్తులు సప్లయిచేయబడుతున్నవి నెలసరి ఆదాయము యాభై రూపాయలకి మించని రోగులకి మందులు, వైద్యసౌకర్యములూ యింజెక్షన్సూ, ఆహారమూ మొదలగునవి వుచితంగా యివ్వబడుతున్నవి. ఇవి ఒక వారమూ, లేక పద్దిరోజుల

పాటు ఆయారోగి పరిస్థితిని బట్టి, ఆయావార్డుల డాక్టరుల సలహా ననుసరించి వుచితంగా యివ్వబడుతున్నాయి. కాఫీ, పాలు, రొట్టె, పళ్లు, బార్లీ, యారోరూట్ మొదలగు ప్రత్యేక ఆహారపదార్థాలు వుచితంగా యిస్తున్నాము. ఈ రోగులలో చాలా మటుకు బీదవారు అతిబీదవారు, మురికి వాడల నుంచి వచ్చేవారు అయి వుంటున్నారు.

అవుట్ పేషంట్ల డిపార్టుమెంటు నిత్యం వుదయం ఎనిమిది పదిగంటల మధ్య వైద్య సౌకర్యములు కలుగజేయుచున్నది. 1962-63. సంవత్సరముల మధ్య37,068 మంది రోగులకీ, 63-64 మధ్య 40, 221 మంది రోగులకి యీ డిపార్ట్ మెంటులో చికిత్స జరిగినది. సాయింత్రము వేళ ప్రతి నిత్యం 4-6 గంటల మధ్య అవుట్ పేషంట్లడిపార్టు మెంటు పనిచేస్తూ వుంటుంది. ఈ వేళల ముఖ్యంగా, గర్భిణీ స్త్రీలకూ, బాలింతలకూ వుచితవైద్య సదుపాయములు యివ్వబడు తుంటాయి. క్రిందటి సంవత్సరం అనగా 63.లో రెండుకొత్తక్లినిక్ లు తెరువబడినవి. 63. మే. లో కంటిక్లినిక్. అక్టోబర్ లో చర్మవ్యాధుల క్లినిక్ అవుట్ పేషంట్లడిపార్ట్ మెంటుకి జోడింపబడినాయి. ఈ రెండు క్లినిక్ లూ అమిత జనాదరణ పొందినవి. అసంఖ్యాకులై బీదరోగులకు వుచిత చికిత్సా సౌకర్యముతో బాటు మందులుకూడా యివ్వ బడుతున్నాయి.

మా నర్సింగ్ హోమ్ లోని ఆపరేషన్ థియేటర్ ఆధునికమైన పరికరములతో ఏర్పరుపబడినది. 1962 63 మధ్య 24 ఆపరేషనులూ, 1963-64 మధ్య 51 ఆపరేషనులూ జరిగినవి. ఇంత వరకూ మా రికార్డులను బట్టి చూస్తే 62-63. కంటే 63-64 లలో ప్రతి శాఖలోనూ ఇటు ఆపరేషనులు, అటుకాన్పు కేసులు ఎటు చూసినా ఆపటి కాపుడు చికిత్స నందు కుంటున్న వారి సంఖ్య పెరుగు తున్న దేగాని తగ్గటం లేదు. మా నర్సింగ్ హోమ్ అన్ని విధాల అభివృద్ధి చెందుతూ, ఒక పటికంటి మరొక ఏడు అధిక సంఖ్యాకులకు వైద్య సౌకర్యములు సమకూర్చగలగడం మాకెంతో ఆనందంగానూ గర్వకారణం గానూ వున్నది.

మెడికల్ సూపరెండెంట్, ఆర్. ఎమ్. ఓ, మరి యిద్దరు లేడీ డాక్టర్లు వీరు నలుగురూ కాక మా నర్సింగ్ హోమ్ లో ప్రముఖులైన ఆనరరీ సర్జనులు ఆదివారాల చైల్డ్ క్లినిక్ బుధవారాల కంటిక్లినిక్, శుక్రవారాల స్కిన్ క్లినిక్ యిలా నిర్వహిస్తున్నారు. ఈ క్లినిక్ ల వల్ల మా నర్సింగ్ హోమ్ చుట్టుపట్ల నున్న అసంఖ్యాలైకున రోగులకి ఈ ప్రముఖుల నుంచి వుచిత వైద్య సలహా లేకాక, మా నర్సింగ్ హోమ్ నుండి మందులు కూడా లభిస్తున్నవి.

ఇక మా శిక్షణా తరగతుల గురించి కొంత మనవి చేస్తాను:

ఆక్జలరీ మిడ్ వైఫ్ ట్రయినింగ్: ఇది రెండు సంవత్సరముల కోర్సు. ఇది 1953. సంవత్సరంలో కేంద్ర ఆరోగ్య మంత్రిత్వ శాఖసహాయంతో కమ్యూనిటీ డెవలప్ మెంట్ ప్రొగ్రాము క్రింద ప్రారంభింప బడినది. 1963. డిశంబరు నాటికి 269. మంది విద్యార్థినులు మా శిక్షణాలయం నుండి వుత్తీర్ణులైనారు.

సంవత్సరానికి యాభైమంది విద్యార్థినులకు రెండేసి జట్లచొప్పున మా నర్సింగ్ హోమ్ లో శిక్షణ యివ్వబడు న్నకుంది. ఒక్కొక్క జట్టుకి పాతిక మంది చొప్పున ఆగస్టు నుండి, డిశంబరు వరకూ శిక్షణ యివ్వబడు తోంది. ప్రస్తుతం 94, గురు నాలుగు జట్లలో శిక్షణ పొందుతున్నారు.

ఈ విద్యార్థినులకి క్లాసురూములలో బోధించడమే గాక, మా నర్సింగ్ హోమ్ లోని వార్డులలోనూ, అవుట్ పేషంట్ డిపార్ట్ మెంటులోను శిక్షణయివ్వబడుతున్నది. జనరల్ సిక్ నర్సింగ్ లో ఆరునెలలపాటు శిక్షణ యివ్వడానికి యీ విద్యార్థినులు రాయపేట హాస్పిటల్ కి మిడ్ వైఫ్ రీ ట్రయినింగ్ కి ఎగ్మూర్ లోని ప్రభుత్వ హాస్పటల్ కీ పంపబడు తున్నారు. డొమిసిలిమిడ్ వైఫరీ ట్రయినింగ్ కొరకు, దగ్గిరలో వున్న కార్పొరేషన్ చైల్డ్ వెల్ ఫేర్ సెంటర్ కీ, వెలిచరీ మెటర్నటీ సెంటర్ కీ పంపబడుతున్నారు. ఈ శిక్షణఅంతా జాగ్రత్తగా, క్రమానుగతంగా యివ్వబడు తున్నది.

## శ్రీమతి బెన్నూరి తిమ్మాబాయి

నలుగురు సిస్టర్స్, ఏడుగురు స్టాఫ్‌నర్సులూ యీ శిక్షణ కొరకై నియమించబడినారు. పేరుగాక యిద్దరు సిస్టరుట్యూటర్స్ ప్రత్యేకంగా నియమించ బడినారు పైచెప్పిన వారిలో సిస్టరులూ, స్టాఫ్‌నర్సులు మటుకే ఆగ్జిలరీ మిడ్ వైఫరిస్కీముకింద మంజూరు చేయబడినారు.

1962 సంవత్సరం నుంచి ఆక్జలరీ నర్సీ మిడ్‌వైఫ శిక్షణా విద్యార్థినుల సంఖ్య ఏడాదికి అరవైనుండి నూరువరకు పెంచ్చింపబడినది ఈ విద్యార్థినుల వసతి కొరకు నర్సుల హాస్టలు నూతనంగా నిర్మించడమయినది. హాస్టలు భవనానికి 1963. మే అయిదవ తేదిన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ప్రారంభోత్సవం చేశారు.

ఫామిలి ప్లానింగ్ క్లినిక్ మదర్ యిన్‌ఫర్‌మేషన్ సెంటర్ వారానికి రెండుసార్లు, ఫాదర్ యిన్‌ఫరిమేషన్ సెంటర్ వారానికి మూడుసార్లు నిర్వహింపబడుతున్నవి.

హెల్త్‌విజిటర్సు, సోషల్ వర్కర్లు, స్త్రీ పురుషులు యిద్దరూ యిళ్లకి వెళ్లి కుటుంబ నియంత్రణ పద్ధతులను బోధిస్తున్నారు. ఈ క్లినిక్‌కి ఒక లేడీడాక్టరూ, పార్ట్‌టైముగా ఒక మొగడాక్టరూ వున్నారు. కేంద్ర ప్రభుత్వ సహాయంతో బీద వారికి, కుటుంబ నియంత్రణ సాధనములు వుచితంగా పంచి పెడ్తున్నారు.

కుటుంబ పరిమితిని పాటించే స్త్రీ పురుష లిద్దరికీ మా నర్సింగ్‌హోమ్‌లో ఆపరేషన్లు జరుగుతున్నాయి. ఇవి బలవంతము మీద కాక వారివారి యిష్టానుసార మేజరుగు తున్నవి.

1962–63 మధ్యన 649 గుడా, 63–64 మధ్య 276. మంది ఫామిలీ ప్లానింగ్ సలహాలనూ, సాధనములనూ పాటించారు. 62–63 మధ్య 153 మంది. 63–64 మధ్య 129, గుడా స్త్రీలు స్టరైజ్ చేయించు కున్నారు.

62-63 మధ్య 21 మంది, 63–64 మధ్య 19 మందీ పురుషులు ఆపరేషన్ చేయించు కున్నారు.

ఫామిలి ప్లానింగ్ శిక్షణా కేంద్రం.

ఫామిలీ ప్లానింగ్ ట్రయినింగ్ సెంటర్ 1959 లో ప్రారంభింప బడినది.

ఇది ఒక సంవత్సపు కోర్సు. ఇందు క్లాసుల్లోని లెక్చర్సు, క్లినికల్ వర్క్:- ఫీల్డ్‌వర్కు కొరకు విద్యార్థినిలు మా నర్సింగ్‌హోమ్‌లోని వివిధ శాఖలలో పని చేయడమే కాక, ప్రాక్టికల్ ట్రయినింగ్ కొరకు కార్పొరేషన్ కుటుంబ నియంత్రణ కేంద్రాలకి పంపబడుతున్నారు. తాంబరంలో వున్నవుప సెంటర్‌కి యీ విద్యార్థినులు ట్రయినింగ్ కొరకు పంపబడు తున్నారు.

లోగడ సంత్సరాలలో మా శిక్షణా కేంద్రము నుండి వివిధ రాష్ట్రాలకి చెందిన 147 మంది విద్యార్థినులు వుత్తీర్ణులైనారు. 1962–63 సంవత్సరంలో 47 మంది వుత్తీర్ణులైనారు. 63–64 లో 44 మందికి శిక్షణ యిస్తున్నాము. వీరంతా ఈ సంవత్సరం జూన్ నెల నాటికి తమ శిక్షణా కాలం పూర్తి చేస్తారు.

ఫామిలీ వెలెఫేర్ వర్కర్ల కొరకు ప్రత్యేకం హాస్టల్ నిర్మించబడింది. ఇది కేంద్ర ప్రభుత్వపు సహాయంతో నెలకొల్ప బడినది, 1963. మే. అయిదవ తేదీన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఈ భవనానికి ప్రారంభోత్సవం చేశారు,





# ఆంధ్రమహిళా ప్రెస్



"లాభాలు లేకపోయినా నష్టాలు లేకుండా సాఫీగా నడిచిపోయే కాలం కనుచూపు మేరలో వుంది".

ఆంధ్రమహిళా ప్రెస్ కంపోజింగ్, బైండింగ్, ప్రింటింగ్, ట్రెడిల్ అండ్ మిషన్ ఫీడింగ్ మొదలగు వివిధ శాఖలలో స్త్రీలకి జీవనోపాధికగు వృత్తిలో శిక్షణ గరపుటకు, ఆంధ్రమహిళ పత్రిక సకాలములో అచ్చు వేయుటకూ స్థాపించబడినదన్న విషయం యిక్కడ వేరె చెప్ప నక్కర లేదను కుంటాను.

ప్రెస కంపోజింగ్ సెక్షనులో ఇంగ్లీషు, తెలుగు, తమిళ, హిందీ నాలుగు భాషలున్నవి. ఈ నాలుగింటిలో ట్రయినీస్ వున్నారు. బైండింగ్ శాఖలో కట్టింగ్, పిన్నింగ్ రూలింగ్ పెరఫరేటింగ్ మిషనులున్నాయి. వీటిలోనూ ట్రయినీస్ వున్నారు. మిషన్ శాఖలో ఒక ట్రెడిల్ ఒక సిలండర్ మిషనూ వున్నవి. జీవనోపాధికొరకు వృత్తి విద్య నేర్చుకునే స్త్రీలకు ఈ సెక్షనులో అవకాశము కలుగ జేస్తున్నాము.

1962_63. సం॥ లో ఆంధ్రమహిళా ప్రెస్ ఇరవై మంది స్త్రీలకు వివిధ శాఖలలో ట్రయినింగ్ యిచ్చింది ఈ ట్రయినింగ్ పొందిన వారిలో ముగ్గురు జవానుల భార్యలు కూడా వున్నారు. 62_63. లో ఏడుగురు స్త్రీలు, రెగ్యులర్ వర్కర్స్‌గా వున్నారు. 63_64. లో ఇరవై ఒక్క మందికి ట్రయినింగ్ యిచ్చాము. ఆరుగురు స్త్రీలు రెగ్యులర్ వర్కర్స్‌గా వున్నారు. ట్రయినింగ్‌కని వచ్చిన స్త్రీలకి వారివారి అభిరుచిని బట్టి కంపోజింగ్‌లోనో, బైండింగ్‌లోనో రెండేళ్లపాటు ట్రయినింగ్ యివ్వబడుతుంది. ఈ ట్రయినింగ్ కాలం కొందరికి రెండేళ్లలోపునే పూర్తి అవుతుంది. ఆయా స్త్రీల గ్రహణ శక్తిని బట్టి యీ కాలం నిర్ణయమవుతుంది ట్రయినింగ్ కాలంలో వీరికి ఉచిత వేతనం సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు గ్రాంటు నుండి యివ్వబడుతోంది.

ప్రెస్, పబ్లిక్ నుండి వర్క్ వల్లనూ, ఆంధ్రమహిళ వివిధ శాఖల నుండీ జాబ్‌వర్క్ వల్లనూ పోషింపబడుతోంది. ఏడాదికి వచ్చే జాబ్ వర్కుల ఆదాయంలో ఒక వంతు ఆంధ్రమహిళా సభ వివిధ శాఖల నుంచీ మిగతా రెండు వంతులూ పబ్లిక్ నుండి వస్తున్నది.

1962_63 సం॥ లో ఆరు పుస్తకములు పబ్లిక్ నుండి ప్రింటు చేశాము. ఇవిగాక ఆంధ్రమహిళ పత్రిక నెలనెలా

సకాలానికి తీసుకొని రావడమేగాక, మహిళ బులెటిన్ యింగ్లీషులో ప్రింటు చేశాము.

63–64 లో మూడు పుస్తకములూ, సోవియట్ కాన్సలేట్ నుండి మూడుసార్లు ఫ్లెట్లూ, నెలనెలా ఆంధ్ర మహిళా, మహిళ బులెటిన్ కొన్ని ప్రతులూ ప్రింటు చేశాము ఇవన్నీ నిత్యం చేసే జాబ్ వర్కులు కాక చేస్తున్నవి.

ఆంధ్రమహిళా సభ కార్య కలాపాలు ప్రాంతీయ హద్దులు రాష్ట్రాలు దాటినవి. ఈ సంస్థలో వివిధ ప్రాంతాల విద్యార్థినులు చదువుకుంటున్నారు. అనేక ప్రాంతాల నుంచి దూరదేశాల నుంచి ఎందరో కుతూహలంగా యీ సంస్థని చూడటానికి వస్తున్నారు. అటువంటి వారికీ, సంస్థకు అనేక విధాల సహాయం చేసిన యితర ప్రాంతాల వారికీ మనకార్య కాలాపాలని గురించి చెప్పడానికి తెలుగులో ప్రచురితమవుతున్న ఆంధ్రమహిళ పత్రిక చాలదు మన కార్యకాలాపాలు నలుగురికీ తెలియాలంటే అందరికీ తెలిసిన అంగ్లంలో ఒక పత్రిక ప్రచురితం కావాలి అని సభ వ్యవస్థాపకః అధ్యక్షురాలు శ్రీమతి దేశముఖ్ ఆదేశ మిస్తూ వచ్చారు వారి ఆదేశ రూపమే ఇంగ్లీషులో ప్రచురిత మవుతున్న మహిళా బులెటిన్ అయితే యిది ఇంకా సక్రమంగా, సకాలానికి రావటం లేదు. ఆలోపాలు యీ 64–65 సం॥ల్లో సరిదిద్దుకోవాలని ప్రయత్నిస్తున్నాము. ఈ బులెటిన్ కూడా ఆంధ్రమహిళా ప్రెస్‌లోనే ప్రచురిత మవుతున్నది.

ఇక ఆంధ్రమహిళ పత్రిక గురించి యీనాడు చెప్ప వలసిన కొత్త విషయాలేమి లేవు. కాని ప్రచురితమైన ప్రతులలో ఏ ఒక్కటీ వృథా అవడం లేదు. అన్నిటిని వ్యక్తులో, సంస్థలో, లైబ్రరీలో చందాలు చెల్లించి తెప్పించుకుంటున్నారు. ప్రతిక వగుకాయితం, ప్రింటింగ్ చార్జీలూ తీసుకోకుండా ప్రెస్ వుచితంగా ప్రింట్ చేసి యివ్వడం వలన, ఆంధ్రమహిళ పత్రికను నడపడం అంత బరువైన కార్యంగా అనిపించడం లేదు. పత్రిక సకాలానికి, సక్రమంగా వస్తున్నది,

ఇన్ని బాధ్యతలతోనూ ప్రెస్ నష్టం రాకుండా, తన కాళ్ల మీద తాను నిలబడ గలుగుతున్నది. పెద్ద పెద్ద లాభాలు రాకపోయినా వొడుదుడుకులు లేకుండా సాఫీగా నడిచిపోయే కాలం కనుచూపు మేరలో వున్నది, అందులో సందేహం లేదు.

— మాలతీ చందూర్



# ఆర్థోపెడిక్ సెంటర్



ఆంధ్రమహిళా సభ ఈశ్వరీ ప్రసాద్ దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటర్‌లో 1963, మార్చి నెలాఖరు నాటికి 39 గురు పిల్లలు యిన్ పేషంట్సుగా వున్నారు. 63–64 సం॥లో ఇరవైముగ్గురు పిల్లలని చికిత్స కొరకు జేర్చుకొనడమైనది. వీరిలో పదిహేనుమంది ఈ సంవత్సరంలో డిశ్చార్జి చేయబడినారు. ప్రస్తుతం అనగా ఏప్రిల్ ఒకటి 1964 నాటికి మా సెంటర్‌లో 47 గురు పిల్లలు యిన్ పేషంట్లుగా చికిత్సపొందుతున్నారు.

## అవుట్ పేషంట్లు

1963, ఏప్రిల్ ఒకటవ తేది నాటికి ఆరుగురు పిల్లలు అవుట్ పేషంట్లుగా చికిత్స పొందుతున్నారు. 63–64 లో 17 మంది పిల్లలు చికిత్స కొరకు రావడంమయింది, వీరిలో పదహారుగురికి చికిత్స చేయబడి డిశ్చార్జి చేయబడ్డారు ప్రస్తుతం ఏప్రిల్ ఒకటి 64 నాటికి ఏడుగురు వున్నారు.

## విద్యా విషయములు

ఏప్రెల్ ఒకటి 63 నాటికి తమిళ, తెలుగు మాంటిసరి క్లాసులలో క్రమంగా, 14,13, 11 మంది బాల బాలికలు 63 సం॥ లో తమిళంలో ఏడుగురినీ, తెలుగు పదహారుగురినీ, మాంటిసరీ క్లాసులల్లో నాలుగుమందినీ కొత్తగాచేర్చుతున్నాము. 63 సం॥ లో 8 గురు తమిళం నుంచి 9గురు తెలుగునుంచి, 4గురు మాంటిసరీ క్లాసులనుంచి వుత్తీర్ణులై వెళ్లారు. 1964. ఏప్రిల్ నాటికి

పదముగ్గురు తమిళంలోను యిరవైముగ్గురు తెలుగులోను పదకొండు మంది మాంటిసరి క్లాసులలోనూ వున్నారు.

63-64 సం॥లలో మా సెంటర్‌లో ఒకటినుంచి అయిదు వరకుక్లాసులు వుండేవి. 63 డిశంబరులో ఆరవ స్టాండర్డ్ ప్రారంభించడానికి విద్యాశాఖవారి అనుజ్ఞ కోరినాము. కొద్ది రోజుల క్రితమే మరి ఒక స్టాండర్డ్ ప్రారంభింప అనుజ్ఞ లభించినది. ఈ ఆరవస్టాండర్డ్‌లో ఆరుగురు పిల్లలు చదువుతున్నారు ప్రస్తుతం, కొద్ది రోజుల క్రితమే జరిగిన యిన్స్పెక్షనులో మాంటిసరీ, ఎలిమెంటరీక్లాసులలోపిల్లల చదువు సంధ్యలు తృప్తి కరంగానూ, ప్రోత్సాహకరంగాను వున్నట్లు విద్యాధికారులు తమ అభిప్రాయములను వెల్లడించారు.

మా సెంటర్‌లోని ముఖ్య సంఘటనల గూర్చి, విచ్చేసిన ప్రముఖ అతిధుల గురించి కొంత నివేదిస్తాను. 63-64 సం॥ మధ్య షుమారు అరవైనాలుగు మంది ప్రముఖులైన స్త్రీ పురుషులు మా నిలయానికి విచ్చేశారు. వీరిలో కొందరి పేర్లను వుదహరిస్తాను. కేంద్ర విద్యాశాఖ వుపమంత్రి శ్రీమతి సౌందరమ్ రామచంద్రన్, కేంద్ర ఆరోగ్యమంత్రి సుశీల నాయ్యార్. మద్రాసు రాష్ట్ర డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ శ్రీమతి శర్మ, మహరాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ యమ్ డి. చౌదరీ. శ్రీమతి కమలా వి నింబ్కర్, ప్రపంచ ఆరోగ్య సమితిశాఖకి చెందిన ఫ్రాంక్ కె. సాఫోర్డ్, అమెరికన్ కాన్సలేట్‌కి చెందిన రూత్. మె. బెనిస్కీ మున్నగు ప్రముఖులు మా నిలయానికి విచ్చేసి యిచ్చటి చిన్నారి బాలలను తిలకించారు.

## ఇతర వ్యాపకములు

స్వాతంత్ర దినోత్సవం: భారత స్వాతంత్ర దినోత్సవ సభకి శ్రీమతి సరోజినీ వరదప్పన్ అధ్యక్షత వహించారు. మా సంస్థ వ్యవస్థాపక అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్, శ్రీమతి మురుగప్ప చెట్టియార్ ప్రసంగించారు. శ్రీమతి వెంకటేశ్వరరావు పిల్లల యూనిఫారమ్ కొరకు దుస్తులను బహూకరించారు.

వినాయకచతుర్ధి దసరా: వినాయక చతుర్ధినాడు పిల్లలు పూజాదికాలూ, దసరాకి బొమ్మల కొలువూ వుంచారు.

1963. డిశంబరు పదకొండవ తేదిన జరిగిన యూనిఫారమ్ డిస్ట్రిబ్యూషన్‌డే వుత్సవంలో మా పిల్లలు కూడా పాల్గొన్నారు డి పి. ఐ, శ్రీమతి తారా చరియన్ మున్నగు వారు మా పిల్లలకి వారిచేత పంచబడిన యూనిఫారమ్‌లని తిలకించి చాలా ఆనందించారు.

క్రిస్‌మస్‌డే: క్రిస్‌మస్ వుత్సవం మా నిలయం లోని హౌస్‌మదర్ సహాయంతో జరుపు బడింది. క్రీస్తుపుట్టుకని మా పిల్లలు చక్కగా నటించి ప్రదర్శించారు. మిసెస్. ఇడా. యల్. ఛాంబర్స్ బహూకరించిన యూనిఫారమ్స్‌ని పేదపిల్లలకి పంచడమైనది. శ్రీమతి చంద్రన్. శ్రీమతి హెచ్. కృష్ణమూర్తిగారు తయారు చేయించి యిచ్చిన తీపిపదార్ధములను పిల్లలకు పంచిపెట్టాము.

వివేకానందుని జయంతోత్సవము: 1964. జనవరి. పన్నెండవతేదీన రామకృష్ణ మఠమునందు. జరిగిన వివేకానందుని జయంతోత్సవములో మా పిల్లలు పాల్గొన్నారు స్వామి వివేకానందుని జీవిత చరిత్రలు తమిళ తెలుగు భాషలపుస్తకములు మా పిల్లలకి యీయబడినవి.

డ్రస్‌కాంపిటీషన్: 1964. మార్చి అయిదవ తేదీన జరిగిన అఖిలభారత చేనేత వారోత్సవాల ప్రదర్శనలో మా పిల్లలు కీ. శే. సరోజినీదేవి 'గాజుల బేహారి' పద్య నాటికను ప్రదర్శించి. పలువురి ప్రశంసలకి పాత్రులై ప్రధమ బహుమతిని అందుకున్నారు. మార్చి ఎనిమిదవ తేదీని మద్రాసు గవర్నరు యీబహుమతిని వుత్సవంలో మా పిల్లల కొసగారు.

## ఆర్ధిక విషయాలు

ఇక మా సెంటర్ ఆర్ధికస్థితి గూర్చి కొంత మనవి చేస్తాను.

1962-63. సంవత్సరంలో 1,899.83 పైసలు కొరత కలిగినది. ఈ లోటుని భర్తీ చేయడానికి, అరవై రెండులోని కొంత కొరతని భర్తీ చేయడానికి మద్రాసు ప్రభుత్వము మూడు వేల అయిదువందల రూపాయలను మంజూరు చేశారు.

సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు వారిచ్చిన 8,600 గ్రాంటూ బీదపిల్లల కొరకూ, ఫిజియో థెరపిస్టు వేతనానికీ ఖర్చవుతున్నది.

## శ్రీమతి వి. లక్ష్మీ పార్వతి

మాంటు సరీ సెక్షన్‌కి మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖ 1962_63. సంవత్సరాల కని యిచ్చిన గ్రాంటు 1,069 రూ. 63_64 లో అందుకున్నాము.

ఎలిమెంటరీ సెక్షనుకని 63_64 లో అందుకొన్న, గ్రాంట్లు మొత్తం 2,620 రూ 90 నయాపైసలు.

కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ: 1963 64సం॥పు రికరింగ్, నాన్‌రికరింగ్ గ్రాంట్ల కనిమేము పంపిన వినతి పత్రము యింకా మంజూరు కాలేదు. ఈ సంవత్సరంలో మాకింకా విద్యాశాఖ నుండి గ్రాంటు ఏమీ రాలేదు

## హాస్టల్ నిర్మాణ వివరాలు

కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ మా హాస్టల్ నిర్మాణానికై ఒక లక్షరూపాయలు మంజూరు చేశారు. ఇందులో యాభై వేల రూపాయలు 63_64 లో విడుదల చేయబడినవి. మొన్ననే మధ్య మరో యిరవై ఏడువేల రూపాయలు విడుదల చేయబడినవి. ఈ హాస్టల్ నిర్మాణము మిస్సెర్స్ రాజన్. అండ్ కంపెనీకి వప్పగించ బడినది 1964 మార్చి నెలాఖరు నాటికి 76,400 రూ. 63. న. పైసలు ఖర్చు చేయ బడినవి. హాస్టల్ భవన నిర్మాణం. లైట్లు, డ్రైనేజ్ వగైరాలతో కలిపి అంతా పూర్తి అయే సరికి లక్ష ముప్ఫైఅయిదు వేల రూపాయలకి మించేటట్లు వున్నది. ఇందులో లక్ష కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ గ్రాంటు, ముప్ఫై అయిదువేలు హనుమంతరావు దంపతుల విరాళమూ వున్నాయి. కాని యీధనం కూడా చాలదని యిప్పటి వరకూ అయిన ఖర్చులను బట్టి అంచనా వేయ వల్సివస్తోంది.

## 'కేర్' సంస్థ సహాయం

కేర్ సంస్థ మద్రాసు శాఖని వీల్ ఛైర్స్, కొలాప్సబుల్ వీల్ ఛైర్స్, పిల్లల మంచాలు డైనింగ్ హాల్ సామాగ్రి మున్నగు మా పిల్లలకు ప్రత్యేకంగా కావలసిన సామాగ్రిని యివ్వమని కోరాము. మా ప్రయత్నం ఫలప్రదంకాగలదనీ. యీ సంస్థవారు మా అభ్యర్థనని త్రోసి వేయరనీ అను కొంటున్నాము.

వాన్; సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు వాన్ ఖరీదు చేయడానికి 19,000, రూ మంజూరు చేశారు సుందరమ్ మోటార్స్ నుంచి 18159-87. న. పైసలు ఖరీదులో ఒక ఫోర్డ్ ఛాసిస్ కొన్నాము. దీనికి బాడీ కట్టడానికి 9175 రూ. అవుతుంది. ఈ పనిసింప్సన్ కంపెనీకి వప్పజెప్పబడింది.

1963 జూన్ పదిహేనవ తేదీ నుంచి అంటే షుమారు ఏడాదినుంచీ యీ వాన్ అవుట్ పేషంట్లని మా సెంటరుకు కొని రావడానికి, తిరిగి ఇళ్లకు వెళ్లడానికివు పయోగపడుతోంది. ప్రస్తుతం అయిదుగురు అవుట్ పేషంట్లు వాన్‌ని తమరాక పోకలకు వుపయోగిస్తున్నారు. వీరివద్ద నుంచి అతితక్కువ వాన్ రేట్లు వసూలు చేయబడుతున్నాయి



# మహిళా విద్యాలయం



## 1962-'63 సంవత్సరపు రిపోర్టు

1962-'63 సంవత్సరములో మహిళా విద్యాలయం లోని మొత్తము విద్యార్థినుల సంఖ్య 229.

వివిధ తరగతులలోని విద్యార్థినుల సంఖ్య దిగువ సూచించబడియున్నది:

| | | |
|---|---|---|
| కాశీ విశ్వవిద్యాలయపు | సీనియర్ అడ్మిషన్ తరగతి | 79 |
| ,, | జూనియర్ ,, | 48 |
| ,, | సబ్ జూనియర్ ,, | 31 |
| ఆం. ధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ | సీనియర్ తరగతి | 25 |
| ,, | జూనియర్ తరగతి | 22 |
| ,, | సబ్ జూనియర్ తరగతి | 13 |
| ప్రిపరేటరీ తరగతి | | 9 |
| ఎస్.ఎస్.ఎల్.సి. తరగతి (మద్రాసు) | | 2 |
| | | 229 |

మార్చి 1963 లో జరిగిన కాశీ విశ్వవిద్యాలయపు అడ్మిషన్ పరీక్షకు 51 విద్యార్థినులను సెలెక్టుచేసి పంపగా వీరిలో 31 రు ద్వితీయ శ్రేణిలోనూ, 13 గురు తృతీయ శ్రేణిలోనూ - మొత్తం 44 గురు ఉత్తీర్ణులైరి. ఉత్తీర్ణులైన విద్యార్థినుల సంఖ్య 86%.

మార్చి 1963 లో జరిగిన ఆంధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్షకు 18 గురు విద్యార్థినులను సెలెక్టుచేసి పంపగా, వీరిలో 8 గురు మార్చి '63

పరీక్షలోనూ, 3 రు సెప్టెంబరు '63 పరీక్షలోనూ ఉత్తీర్ణులైరి. ఉత్తీర్ణులైన విద్యార్థినుల సంఖ్య 61%.

అక్టోబరు 62 లో జరిగిన మద్రాసు ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు ఒక విద్యార్థిని హాజరైనది. కానీ, ఆమె పరీక్ష తప్పినది, మరియొక విద్యార్థిని అనారోగ్యం వల్ల పరీక్షకు హాజరు కాలేదు.

## 1963-'64 సంవత్సరపు రిపోర్టు

1963_64 సంవత్సరములో మహిళా విద్యాలయం లోని మొత్తము విద్యార్థినుల సంఖ్య 249.

వివిధ తరగతులలోని విద్యార్థినుల సంఖ్య దిగువ సూచించ బడియున్నది:

| | |
|---|---|
| కాశీ విశ్వవిద్యాలయపు సీనియర్ అడ్మిషన్ తరగతి | 103 |
| " జూనియర్ " | 39 |
| " సబ్ జూనియర్ " " | 34 |
| ఆంధ్ర విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ సీనియర్ తరగతి | 29 |
| " " జూనియర్ | 21 |
| " " సబ్ జూనియర్ " | 11 |
| ప్రిపరేటరీ తరగతి | 6 |
| ఎస్. ఎస్. ఎల్. సి. తరగతి (మద్రాసు) | 6 |
| | 249 |

మార్చి 1964 లో జరిగిన కాశీ విశ్వవిద్యాలయపు అడ్మిషన్ పరీక్షకు 71 మంది విద్యార్థినులను సెలెక్టు చేసిపంపగా, ఇందులో ఒకరు ప్రథమశ్రేణిలోనూ, 39గురు ద్వితీయ శ్రేణిలోనూ, 22గురు తృతీయ శ్రేణిలోనూ, మొత్తము 62 మంది ఉత్తీర్ణులైరి. ఉత్తీర్ణులైన విద్యార్థినుల సంఖ్య 87%.

4గురు విద్యార్థినులు జూలై 64లో జరుగనున్న సప్లిమెంటరీ పరీక్షకు వెళ్లుచున్నారు.



మార్చి 1964 లో జరిగిన ఆంధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్షకు 22రు విద్యార్థినులను సెలెక్ట్ చేసి పంపగా, వీరిలో ఒకరు ప్రథమశ్రేణిలోనూ, 8రు ద్వితీయ శ్రేణిలోనూ, 4రు తృతీయ శ్రేణిలోనూ, మొత్తము 13 గురు ఉత్తీర్ణులైరి. ఉత్తీర్ణులైన విద్యార్థినుల సంఖ్య 59%.

మార్చి 1964 లో జరిగిన మద్రాసు ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు యిద్దరు విద్యార్థినులు హాజరైరి. ఇద్దరు ఉత్తీర్ణులు కాలేదు.

ఆంధ్రమహిళా సభ సంక్షిప్తవిద్యాప్రణాళిక
1962–63 సంవత్సరపు రిపోర్టు

వయోజన స్త్రీలకుగాను కేంద్ర సంఘ సంక్షేమ బోర్డు వారు మంజూరు చేసిన సంక్షిప్త విద్యాప్రణాళిక తరగతులలో 1962-63 సంవత్సరములో. 23 గురు యువతులు చేర్చుకో బడిరి. వీరిలో ముగ్గురు కొన్ని అవాంతరాల వల్ల చదువు మానివేసిరి ఆంధ్రా విశ్వవిద్యాలయపు సీనియర్ మెట్రిక్యులేషన్ తరగతిలో 8గురు, మద్రాసు ఎస్. ఎస్. ఎల్. సి. జూనియర్ తరగతిలో ఒకరు. జూనియర్ ఆంధ్రా మెట్రిక్యులేషన్ తరగతిలో 7రు ఎస్. ఎస్. ఎల్. సి. జూనియర్ తరగతిలో 3రు. కాశీ విశ్వవిద్యాలయపు జూనియర్ అడ్మిషన్ తరగతిలో ఒకరు చేరిరి.

టి. సుశీలాదేవి

మార్చి 1963 లో జరిగిన ఆంధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్షకు 8గురు హాజరుకాగా ఒకరు ద్వితీయ శ్రేణిలోనూ, నలుగురు తృతీయ శ్రేణిలోనూ, మొత్తము ఐదుగురు ఉత్తీర్ణులైరి. అక్టోబరు '62 లో జరిగిన మద్రాసు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షకు ఒక విద్యార్థిని హాజరైనది కానీ, పరీక్ష తప్పినది. ఉత్తీర్ణులైన విద్యార్థినుల సంఖ్య 55%.

జూనియర్ తరగతులలో చేరిన 11రు విద్యార్థినులు ఏప్రిల్ '63 సీనియర్ తరగతులకు పంపబడిరి.

1962-'63 సంవత్సరములో లభించిన గ్రాంటు మొత్తము రూ 10,000/-

63–64 సంవత్సరపు రిపోర్టు

1963-'64 సంవత్సరములో సంక్షిప్త విద్యాప్రణాళిక తరగతులలో మొత్తము 16గురు విద్యార్థినులుండిరి, వీరిలో 11గురు జూనియర్ తరగతులనుండి ఉత్తీర్ణులై వచ్చినవారు, ఐదుగురు క్రొత్తగా చేరినవారు,

ఈ 16 గురిలో, 13రు మార్చి 1964లో పబ్లిక్ పరీక్షలకు హాజరైరి, 8గురు ఆంధ్రా విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్షకు హాజరుకాగా, ఒకరు ప్రథమ శ్రేణిలోనూ, యిద్దరు ద్వితీయ శ్రేణిలోనూ, యిద్దరు తృతీయ శ్రేణిలోనూ–మొత్తము ఐదుగురు ఉత్తీర్ణులైరి.

మార్చి 1964 లో జరిగిన కాశీ విశ్వవిద్యాలయపు అడ్మిషన్ పరీక్షకు ఒక విద్యార్థిని కట్టగా, ఉత్తీర్ణురాలు కాలేదు.

మార్చి 1964లో జరిగిన మద్రాసు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షకు నలుగురు విద్యార్థినులు హాజరైరి. కానీ, వీరు ఉత్తీర్ణులు కాలేదు.

అనారోగ్యంవల్ల ముగ్గురు విద్యార్థినులు 1964 మార్చిలో జరిగిన పరీక్షలకు హాజరు కాలేదు.

1963-1694 సంవత్సరములో లభించిన గ్రాంటు మొత్తము రూ 8,000/-



# మల్లమ్మదేవి హాస్టల్

### 1963 నుండి సంవత్సర నివేదిక.

మల్లమదేవి హాస్టల్‌లో 1963 జూన్ ప్రారంభము నుండి 64 ఏప్రిల్ వరకు మొత్తం 75 మంది వున్నారు. వీరిలో హెడ్‌మిస్ట్రెస్, ఒక టీచరు, ఒక స్టోర్‌కీపరూ సహా స్టాఫ్ నలుగురు. బయట యితర ఆఫీసులలోను వార్డెన్‌తో స్కూల్సులోను పనిచేయు ఉద్యోగులు 12 మంది. బనారస్ మెట్రిక్, ఆంధ్రా మెట్రిక్. మద్రాసు యస్. యస్ యల్. సి. ప్రిపరేటరీ క్లాసులలోను చదువు మొత్తం విద్యార్థినులు 59 గురు.

ఈ విద్యార్థినులలో ఫిజీ అయిలాండ్ ఒక విద్యార్థిని. బనారస్ మెట్రిక్ వెళ్లి సెకండ్ క్లాస్‌లో పాస్‌అయింది. బి. నాగరత్నమ్మ అనే విద్యార్థిని ఆంధ్రమహిళాసభ నర్సింగ్‌హోమ్‌లో ఫామిలీప్లానింగ్ ట్రయినింగ్ పాస్ అయిన వెంటనే మల్లమదేవి హాస్టల్‌కి వచ్చి ఆంధ్రా మెట్రిక్ సెకండ్ క్లాస్‌లో పాస్ అయింది ఇప్పుడు ఆమె హైద్రాబాద్ ఆంధ్ర మహిళాసభలో హెల్త్ విజిటర్‌గా పనిచేస్తున్నది. వీరు కాక మన ఆర్థోపెడిక్ సెంటర్‌లో ట్రీట్‌మెంట్ పూర్తి అయిన తరువాత మల్లమదేవి హస్టల్‌కు వి. యశోద అనే అమ్మాయి నిరుడు సంవత్సరము ఆంధ్రామెట్రిక్ సబ్ జూనియర్‌లో చేరి, చదివి, జూనియర్ క్లాస్‌కి ప్రమోట్ చేయబడింది.

జూన్ నెలలో అన్ని క్లాసులు తెరవగానే గత సం॥ విద్యార్థినిలు, క్రొత్తగా చేరిన విద్యార్థినిలు రావడము ప్రారంభమై జూలై నెలాఖరుకి హాస్టలు అన్ని రూములు భర్తీ అవుతూ వున్నాయి. హస్టలు వాసులు అందరూ ఆరోగ్యముగానే ఉంటున్నారు. ఏమైనా అస్వస్థతగా ఉన్నప్పుడు, మన నర్సింగ్‌హోమ్ సూపెరెండెంట్ డాక్టర్ పావనాబాయ్ గారు తదితర డాక్టర్లూ, డాక్టర్ అవధాని గారు, ఏ టైముకి వెళ్లినా సరే, తగిన చికిత్సచేసి ఆరోగ్యవంతులుగా చేస్తున్నారు.

ప్రతీరోజు సాయంత్రం 5 నుండి 6 గం॥ వరకు హాస్టల్ విద్యార్థినిలు వనితా బాలవిహార్‌కి వెళ్లి ఆడుకొని వస్తు ఉంటారు.

హాస్టల్‌లో ప్రతీ సంవత్సరము వినాయక చవితి, స్వాతంత్రదిన ఉత్సవము, వరలక్ష్మి పూజ మొదలగు అన్ని పండగలు తెలుగు సంవత్సరాది వరకు యధావిధిగా జరపబడుతూనే ఉన్నాయి.

నిరుటి సంవత్సరము ఆంధ్రమహిళాసభ టూరిస్టు హాస్టల్ ప్రారంభోత్సవమునకు వచ్చినసాంగ్లీ రాజదంపతులు సభకు వచ్చి మల్లమదేవి హాస్టల్ కూడ చూచిచాలా ఆనందించేరు. అక్టోబర్ 63లో విజయదశమి నాడు అమెరికా, జపాన్, దక్షిణాఫ్రికా ఫిజిఅయిలాండ్ జర్మనీ మొదలగు దేశాల నుండి మద్రాసు వచ్చి చదువుచున్న స్త్రీ పురుష విదేశ విద్యార్థులకు హాస్టల్‌లో విందు యిచ్చితిమి. విందు ఆరగించిన తరువాత, గాన నృత్యములుచేసి యిక్కడ సంగతులు కూడ తెలిసికొని, బొమ్మలు కొలువు చూచి చాలా సంతోషించేరు. మల్లమదేవి హాస్టల్‌కు ప్రతి సంవత్సరము మాదిరిగా 64 మార్చి 1వ తారీకున మన సభ ప్రథమ విద్యార్థిణి అయిన వారణాసి వరలక్ష్మమ్మగారు తెలుగు పండిట్‌గారి అధ్యక్షతను 22వ. హాస్టల్ దినోత్సవము జరుపబడింది.

**శ్రీమతి జి. వెంకుబాయమ్మ**

మల్లమదేవి హాస్టల్‌కు 63 సెప్టెంబర్‌లో బర్షన్ గ్యాస్‌పొయ్యి పెట్టించు కున్నాము. దానివలన కొంతడబ్బు హెచ్చుఅయినా సదుపాయముగానే వుంది. బోర్‌వెల్ వాటర్ మిషన్ చెడిపోయి నందున ఈ నెలలో క్రొత్తది వేయించు కున్నాము. ప్రతినెల హాస్టల్ చార్జీలు 10వ. తారీకు లోపుగానే వసూలు చేయబడు చున్నవి. ఈ సంవత్సరము హాస్టలు ఛార్జీలు స్వల్పముగా పెంచబడినవి. ధరవరలు హెచ్చుట చేత.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి., పరీక్షలకు శిక్షణ.

**పారిశ్రామిక విద్యాలయము** : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

**మహిళా మందిరము** : విద్యార్థినులకు వసతి గృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

**నర్సింగ్ హోమ్** : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది.

**ఆర్థోపీడిక్ సెంటర్** : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమ కేంద్రం.

**ముద్రణా లయము** : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు్స చేయబడును.

**నాగేశ్వర శిశువిహార్** : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది.

**వనితా బాలవిహార్** : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

(1) ప్రాంతీయ చేతిపనుల శిక్షణాలయం. (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ- ఉత్పత్తికేంద్రము, (4) బేసిక్ విద్యాశిక్షణాలయం (5) శిశువిహార్ (6) కుటుంబ నియంత్రణ శాఖ. (7) ఆక్జలరినర్స్ మిడ్‌వైఫ్ ట్రయినింగ్ (8) వసతిగృహము.

Printed and Published by N. R. Chendur at Andhra Mahila Press, 7-A, Rosary Church Road, San Thome, Madras-4. Hony. Editor: Mrs. Malati Chendur